వార్త

ఆదివారం

25 సెప్టెంబరు 2016



# హార్ట్ ఎ'టాక్'!

## గుండె ఆరోగ్యం గుప్పెట్లోనే..

## తారాతీరం

# టాప్ బ్రాండ్స్‌కు అంబాసిడర్‌గా..






తెలుగులో టాప్ హీరోయిన్ రేసులో రకుల్‌ప్రీత్ సింగ్ దూసుకుపోతున్నారు. సూపర్‌స్టార్ మహేష్‌బాబు సరసన ఓ సినిమా; రామ్‌చరణ్‌తో ధృవ అనే సినిమా చేస్తున్నారు. ప్రస్తుతం ఆమె బాలీవుడ్‌లో హాట్ టాపిక్‌గా మారిపోయారు. రకుల్ పాపులారిటీని క్యాష్ చేసుకునేందుకు ఆమెను పలు టాప్ బ్రాండ్స్ అంబాసిడర్‌గా వ్యవహరించమని కోరుతున్నారు. ఇప్పటికే ఇండియాలో టాప్ లెవల్‌లో ఉన్న పలు బ్రాండ్స్‌కు అంబాసిడర్‌గా వ్యవహరిస్తున్న రకుల్ తాజాగా ఓ మొబైల్ స్టోర్ బ్రాండ్‌కు అంబాసిడర్‌గా ఎంపికయ్యారు.

## ఐటమ్ వర్కవుట్

సౌతిండియన్ స్టార్ హీరోయిన్లలో ఒకరైన కాజల్, 'టెంపర్' తర్వాత మళ్లీ ఆ స్థాయిలో హిట్ అందుకోలేకపోయారు. కొద్ది నెలల క్రితమే విడుదలైన 'సర్దార్ గబ్బర్‌సింగ్', 'బ్రహ్మోత్సవం' సినిమాలతో మళ్లీ సత్తా చాటాలనుకున్నా అవి బాక్సాఫీస్ వద్ద పరాజయం పాలయ్యాయి. ఆమె నటించిన హిందీ సినిమా 'దో లఫ్జోంకీ కహానీ' కూడ పరాజయం పాలైంది. వీటన్నింటి మధ్యన కాజల్ కెరీర్‌కు 'జనతా గ్యారేజ్' మంచి ఊపునిచ్చింది. ఈ సినిమాలో ఆమె ఒక్క స్పెషల్ సాంగ్‌లోనే కన్పించినా ఆ పాటతోనే మళ్లీ కొత్త క్రేజ్ సంపాదించుకున్నారు. ఈ నేపథ్యంలో కాజల్ హీరోయిన్‌గా నటిస్తోన్న 'కవలై వెండం' అనే సినిమాను తెలుగులోనూ డబ్ చేస్తున్నారు. నిర్మాత డి.వెంకటేష్ తెలుగు డబ్బింగ్ హక్కులను సొంతం చేసుకున్నారు.



## డిజె భామ సయ్యాట!

స్టైలిష్ స్టార్ అల్లు అర్జున్ 'సరైనోడు' సినిమాతో సక్సెస్ సాధించి దాదాపు 5 నెలలు పూర్తవుతోంది.. రీసెంట్‌గానే తను చేయబోయే తదుపరి చిత్రాన్ని అనౌన్స్ చేశారు బన్నీ. హరీష్‌శంకర్ దర్శకత్వంలో డిజె. దువ్వాడ జగన్నాథం టైటిల్‌పై బన్నీ నటించనున్న మూవీలో హీరోయిన్‌గా పూజా హెగ్డే ఎంపికయ్యారు. కాగా ఆరేళ్ల క్రితమే మిస్ ఇండియా పోటీల్లో సెకండ్ రన్నరప్‌గా నిలిచిన ఈమెకి ఫిట్నెస్‌పై బాగా మక్కువ. రెగ్యులర్‌గా చేసే వర్కవుట్స్ కాకుండా, రీసెంట్‌గా ఏరియల్ సిల్క్‌ని పూజా హెగ్డే తెగ ప్రాక్టీస్ చేసేస్తోంది. ఎటువంటి సేఫ్టీ రోప్స్ లేకుండా కేవలం ఓ క్లాత్‌ను పట్టుకుని వేళ్లాడుతూ విన్యాసాలు చేయాల్సి ఉంటుంది. దీన్ని ప్రాక్టీస్ చేయటంద్వారా అప్పర్ బాడీకి బాగా స్ట్రెంగ్త్ చేకూరుతుంది. అలాగే మెలికలు తిరిగేందుకు కూడ హెల్ప్ అవుతుంది. అందుకే ఏరియల్ సిల్క్‌ని తెగ ప్రాక్టీస్ చేసేస్తోంది పూజా. 'ఇంటర్నేషనల్ సింగర్ పింక్ నుంచి స్ఫూర్తి పొంది ఇది నేర్చుకున్నా... నాకు హైట్ అంటే భయం ..పైగా నేను అంత ఫ్లెక్సిబుల్ కాదు. భయం అలాగే ఉంది కానీ. ఇపుడు నేను ఫిట్నెస్ లెవల్‌ని మాత్రం పెంచుకోగలిగా!' అంటోందీ పూజా.

కె. సురేష్ బాబు




25 సెప్టెంబరు 2016

## మంచి ముత్యాలు

నదుల నిండా నీరుంటుంది. కానీ ఆ నీరు నదులు తాగవు. చెట్ల నిండా పళ్లున్నా అవి చెట్లు తినవు. అలాగే ధర్మాత్ములైనవారు తాము సంపాదించింది తాము అనుభవించక సమాజ శ్రేయస్సు కోసం వాడతారు.

–బ్రేడర్ హోర్న్

## విషయ విశేషం








## లేఖలు

### అవగాహన కలిగించింది

సెప్టెంబరు 11 వార్త ఆదివారం అనుబంధంలో 'జనహితాలు..జెనరిక్ ఔషధాలు!' కవర్ స్టోరీ పాఠకుల్లో జెనరిక్ ఔషధాల గురించి చక్కని అవగాహన కలిగించింది. మా ఊళ్లో ఒక వైద్యుడు జెనరిక్ మందులు వాడవద్దని హెచ్చరించాడు. అటువంటివారికి ఈ వ్యాసం ఒక కనువిప్పు. –కొత్తపల్లి హరిబాబు, గుంటూరు.

### ఆద్యంతం ఆసక్తికరం..

సెప్టెంబరు 11 వార్త ఆదివారం అనుబంధం ఎంతో ఆసక్తిదాయకంగా, ఆకర్షణీయంగా ఉంది. అంబులెన్స్‌ల కొరతవల్ల ఎదురవుతున్న వ్యథ మా హృదయాల్ని కలచివేసింది. 'కలిమి' కథ విభిన్న కథాంశంతో మళ్లీమళ్లీ చదివించేలా ఉంది. జెనరిక్ ఔషధాల గురించిన కవర్ కథనం ఆలోచింపజేసింది. సామాన్యులకు జెనరిక్ ఔషధాలు సంజీవనుల్లాంటివి. –సిహెచ్.సాయి ఋత్విక్, నల్గొండ.

### స్ఫూర్తినిచ్చే రీతిలో చిత్రభారతి..

సెప్టెంబరు 11 వార్త ఆదివారం అనుబంధంలో చిత్రభారతి శీర్షికన నాగిరెడ్డి, చక్రపాణిగార్ల స్నేహానుబంధం , నాగిరెడ్డి ఔదార్యం, చక్రపాణి సాహిత్యాభిలాష అంశాలతో స్ఫూర్తి దాయక వ్యాసం అందించిన వాశిరాజు వారికి ధన్యవాదాలు. –గొడవర్తి బాపయ్య గుప్త, పొన్నూరు.

### కవిత బాగుంది

సెప్టెంబరు 11 వార్త ఆదివారం సంచికలో 'అడవితల్లి రుణం' కవిత చాలాబాగుంది. అడవుల ప్రాముఖ్యాన్ని తెలిపిన కవికి అభినందనలు. –శాంతమూర్తి,హైదరాబాద్.

### అంశాలన్నీ నచ్చాయి

సెప్టెంబరు 11 వార్త ఆదివారం సంచికలో కర్బన ఉద్గారాలను తగ్గించాల్సిన ఆవశ్యకత గురించిన సంఘీభావం బాగుంది. చిత్రభారతిలో నాగిరెడ్డి, చక్రపాణిల జ్ఞాపకాల పరిమళం ఆనందింపజేసింది. 'కలిమి'కథ, ఫొటో ఫీచర్స్ ఆకట్టుకున్నాయి. –నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖ.

### చైతన్యదాయకాలు

సెప్టెంబరు 11 సండే బుక్‌లో భూమాతను నిప్పులకొలిమి చేయవద్దన్న సంఘీభావం ఆటల గురించిన మూడోకన్ను, జెనరిక్ మందుల గురించిన కవర్‌స్టోరీ చైతన్యదాయకాలుగా ఉన్నాయి. మంచి ఆర్టికల్స్ అందించిన మీకు మా అభినందనలు. –అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యం, కూకట్‌పల్లి.

## భావ వీచిక



### ఉత్తేజాన్నిచ్చే యాత్రలు..

ఈ విశాల ప్రపంచంలో ఎన్నెన్నో సుందరమైన తావులు, అచ్చెరువొలికించే కట్టడాలు, చారిత్రక, సాంస్కృతిక ప్రత్యేకతలు గల ఎన్నెన్నో ప్రాంతాలు, పుణ్యక్షేత్రాలు..అందాల దీవులు.. కన్నుల విందుచేసి, మనసుకు కొత్త ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని అందించే పర్యాటక ప్రాంతాలు ఎన్నెన్నో ఉన్నాయి. ఒకప్పుడు టూర్‌కు వెళ్లటం భాగ్యవంతులకే సాధ్యం అనుకునే వారు. కానీ ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. ఏటా తమకున్న బడ్జెట్‌లో ఎంతో కొంత టూర్‌కోసం కేటాయించుకొని, ఏదో ఒక కొత్త ప్రాంతాన్ని దర్శించి వచ్చే వారి సంఖ్య పెరిగింది. అలాగే పర్యాటకం వల్ల ప్రభుత్వానికి సైతం ఆదాయం వస్తుంది కాబట్టి పర్యాటక ప్రాంతాలను అభివృద్ధి చేయటం, పర్యాటకులకు తగిన సదుపాయాలు కల్పించటం, వాటికి తగిన ప్రచారం చేయటం ప్రభుత్వ పర్యాటకశాఖలు చేస్తూనే ఉన్నాయి. టూర్ ప్లానింగ్ కూడా ఓ కళే. ఏప్రాంతాలనైతే చూడాలను కుంటున్నారో, ఆ ప్రాంతాలను ఆల్‌రెడీ సందర్శించిన వారి అనుభవాలను నెట్‌లో చదివి ఎంతో తెలుసుకోవచ్చు. అలాగే వెళ్లాల్సిన రూట్ కూడా ముఖ్యమే. టూర్‌లకు వెళ్లినప్పుడు ఓ హ్యాండ్‌బుక్ వెంట ఉంచుకుని అక్కడి విశేషాలను వివరంగా నోట్ చేసుకోవటం మరీముఖ్యం. అలాగే పర్యాటక ప్రాంతాలకు వెళ్లినప్పుడు స్నాక్స్ ప్లేట్లు, కవర్లు, రేపర్లు, టీ కప్పులు, ఖాళీ వాటర్ బాటిల్స్ ఎక్కడంటే అక్కడ పడేయకూడదన్నది కూడా గుర్తుంచుకోవాలి. ఎవరెస్ట్‌పై సైతం చెత్త పోగయిందంటే మనలో ఇంకా పర్యావరణాన్ని గురించిన స్పృహ తగినంతగా లేదనేకదా. ఎంతో కొంత పొదుపు చేసయినా సరే టూర్లకంటూ కొంత డబ్బు మిగుల్చుకో గలగాలి. అప్పుడే సుందరప్రపంచాన్ని వీక్షించగలం, అనుభూతించగలం, తద్వారా మనం పునరుత్తేజితులం కావచ్చు. అలాగే ఇతరదేశాలనుండి మన దేశానికి వచ్చే పర్యాటకుల పట్ల కూడా గౌరవ, మర్యాదలతో, తోడ్పడేరీతిలో మెలగడం ఎంతైనా అవసరం.

సెప్టెంబరు 27 వరల్డ్ టూరిజం డే. కేంద్ర టూరిజం శాఖ వారు విదేశీ యాత్రికులకు ఫ్రీ సిమ్ కార్డ్ ఇచ్చి, వారికి మొబైల్ సమస్య లేకుండా చేయాలను కోవడం ప్రశంసనీయం!

ఈ వారం కార్టూన్స్


"వింగ్స్" ఆర్డర్ ఇచ్చింది మీరేగదా సార్?
కె.వి.సుబ్రహ్మణ్యం


నా దగ్గర డబ్బులుండవు తల్లీ... నీ పూజలు కొనడానికి!
నే చేసే పూజలు కొనుమమ్మా
నే చేసే పూజలు కొనుమమ్మా
నే చేసే పూజలు కొనుమమ్మా
కెవి సుబ్రహ్మణ్యం


ఉరివేసుకొనుటకు క్రింది అరలో చీరలు మాత్రమే వాడాలి!
కె.వి. సుబ్రహ్మణ్యం

‘సంఘీ’భావం

# మేల్కొనకపోతే జరిగేవి జలయుద్ధాలే!



దేశం ముంగిట ఇప్పుడు ఏర్పడిన ఓ ప్రధాన సవాల్ అందరినీ కలవరపెడుతున్నది. కల్లోలానికి గురి చేస్తున్నది. కర్ణాటక, తమిళ నాడు రాష్ట్రాల మధ్య ఇటీవల జరిగిన జలయుద్ధం దేశమంతటా ప్రకంపనలు సృష్టిస్తున్నది. కావేరీ జలాల వాటాకోసం సుప్రీంకోర్టు జోక్యం చేసుకున్న తరువాత కూడా నీటికోసం రెండు రాష్ట్రాల్లో విధ్వంసంతో కూడిన ఉద్రిక్తత వాతావరణం ఏర్పడింది. ఇది చివరకు రెండు రాష్ట్రాల దైనందిన జీవనాన్ని మూడు రోజులపాటు స్తంభింపచేసింది. ఈ రాష్ట్రాలు ఇటీవల కాలంలో ఉత్పత్తి రంగం, సేవా రంగంలో జెట్ స్పీడుతో దూసుకువెడుతున్న తరుణంలో వచ్చిన నీటి సంక్షోభం ఆ రంగాలను కూడా వణికింపచేసింది.

ఇన్ఫోసిస్ అధినేత నారాయణమూర్తి ఈ సంక్షోభంపై స్పందిస్తూ- తెలంగాణాలో ఉద్యమం పతాక స్థాయికి చేరిన సమయంలో కూడా హైదరాబాద్‌లో ఐటి కంపెనీల కార్యకలాపాలు కొనసాగాయి. కానీ నీటియుద్ధం సృష్టించిన విధ్వంసంతో రెండు రాష్ట్రాల్లో ఐటి కంపెనీలు, భారీ ఉత్పత్తి కంపెనీలు మూసుకోవలసిన పరిస్థితి ఏర్పడటం దయనీయమని ఆయన ఎంతో ఆందోళనతో వ్యాఖ్యానించారంటే అక్కడ పరిస్థితి ఎలా మారిపోయిందో విడమరిచి చెప్పనక్కరలేదు.

జలయుద్ధాలు అనివార్యమని కాలజ్ఞానంలో బ్రహ్మంగారు ఎప్పుడో చెప్పారు. అంతకుమించి శాస్త్రవేత్తలు, సామాజికవేత్తలు కూడా ఎంతో కాలంగా నీటికొరత మనకు ముమ్ముందు పెను సవాల్‌గా మారనున్నదని పాలకులను హెచ్చరించారు. నివేదికలు ఇచ్చారు. అయినా వాటిని ఎవరూ పట్టించుకోకపోవడంతోనే రెండు రాష్ట్రాల మధ్య జలయుద్ధం జరిగింది. ఇది ఇక్కడికే పరిమితం అవుతుం దనుకుంటే పొరపాటే. ముమ్ముందు రెండు తెలుగు రాష్ట్రాల్లో జరగవచ్చు, ఉత్తరాది, దక్షిణాది రాష్ట్రాల్లో కూడా ఈ జల జగడాలు ఎదురుకావచ్చు. ఇప్పటికే విడిపోయిన ఆంధ్రప్రదేశ్, తెలంగాణా రాష్ట్రాలు న్యాయమైన నీటి వాటా అంటూ కృష్ణా, గోదావరి జలాల కోసం పలు రకాల పోరాటాలు చేస్తున్నాయి. ఇవి ఎంతకూ తెగని పరిస్థితి కనిపిస్తున్నది. మరోవైపు ప్రకృతి శాపం అందరినీ వెంటాడుతున్నది. ఇప్పటికీ రెండు సంవత్సరాలుగా ఎక్కడా సాధారణ వర్షపాతం నమోదు కాలేదు. ఈ ఏడాది కూడా సగం ఖరీఫ్ సీజన్ ముగిసింది. అయినా రెండు రాష్ట్రాల వరప్రదాయినులుగా వున్న నాగార్జునసాగర్, శ్రీశైలం రిజర్వాయర్లు నిండనేలేదు. ఈ రెండు ప్రాజెక్టుల గేట్లు తెరిస్తేనే తెలుగు రాష్ట్రాల్లో జలకళ కనిపిస్తుంది. లేదంటే నీళ్లు లేక రైతులు నీరందక చివరకు ప్రధాన పట్టణాలకు సాగునీరు అందక ప్రజలు విలవిలలాడే పరిస్థితి ఎదురుకావచ్చు.

ఈ ఏడాది కూడా సంతృప్తికర వర్షాలు లేకపోతే వరుసగా మూడో ఏడాది మనం కరువును ఎదుర్కొన్నట్లే! ఇప్పటికే కరువు ప్రభావంతో వివిధ రంగాలు సంక్షోభ పరిస్థితిని ఎదుర్కొంటున్నాయి. ఫలితంగా ఆర్థిక మందగమనం అంతటా కనిపిస్తున్నది. వర్షం ఉంటేనే రైతు మోములో చిరునవ్వు కనిపిస్తుంది. రైతు పని చేస్తేనే ఆహార ఉత్పత్తి సాధ్యమవుతుంది. ఉత్పత్తుల విక్రయంతో వచ్చే డబ్బుతో అన్ని మార్కెట్లు కళకళలాడతాయి. రైతు చేతిలో డబ్బు కనిపించకపోతే మార్కెట్లు ఎలా ఉంటాయో వర్తమాన పరిస్థితే నిదర్శనం. ప్రస్తుతం పల్లె నుంచి నగరందాకా అది కిరాణా కొట్టు కావచ్చు, వస్త్ర వ్యాపారం కావచ్చు, బంగారం వ్యాపారం కావచ్చు... ఏవీ కూడా గత టర్నోవర్‌తో పోలిస్తే 25 శాతం కూడా విక్రయాలు జరగడం లేదు. ఇది కరువు మిగిల్చిన ప్రభావం. అయితే నీటి సంక్షోభాన్ని నివారించి నీటి యుద్ధాలను ఆపితే తప్ప రాష్ట్రాలు బహుముఖంగా అభివృద్ధి చెందే పరిస్థితి కనిపించడం లేదు. పాలకులు ఇప్పుడైనా మేల్కొని ఉన్న నీటివనరులను పరిమితంగా, పొదుపుగా వినియోగించుకునే మార్గాలను ప్రజల్లోకి తీసుకురావాలి. అవసరమైతే దీనికోసం ఆర్థిక ప్రోత్సాహకాలను ప్రకటించాలి. నీటిని పొదుపుగా వాడుకునే టెక్నాలజీని విస్తృతంగా వాడాలి. అలాగే నీటిని వివిధ అవసరాలకు విచ్చలవిడిగా కాకుండా అవసరం మేరకే వాడుకునే విధంగా నిబంధనలు, చట్టాలు తీసుకురావాలి. వాటి అమలుకు చిత్తశుద్ధితో కృషి చేయాలి.

దేశంలోనైనా, రాష్ట్రంలోనైనా సమగ్ర అభివృద్ధి అంటే కేవలం ఐటి, ఉత్పత్తి రంగాలే కాదు. జనాభాలో 60శాతం మంది ఆధార పడిన వ్యవసాయం కూడా పూర్తి స్థాయిలో కొనసాగితే తప్ప ఆర్థిక పరిస్థితిలో పురోగతి ఉండదు. దీని ఫలితమే కుటుంబాల జీవన ప్రమాణాలు, కొనుగోలు శక్తి కూడా పడిపోతుంది. ఇది అందరికీ తెలిసిందే. అయితే ఇన్ని నీటి సంక్షోభాలు, జగడాలు, యుద్ధాలు ఏర్పడుతున్నా ఎవరికి వారు తమ వాటాకోసమే పోరాడుతున్నారు తప్ప ఉన్న నీటిని ఎలా సమర్థంగా వినియోగించుకోవాలనే విషయంలో శ్రద్ధ చూపడం లేదు. దేశంలో మొత్తం నీటిలో 80 శాతం వ్యవసాయ అవసరాలకే వాడుతున్నారు. చైనా, బ్రెజిల్ దేశాలతో పోల్చి చూస్తే మనం పంటలకోసం 2 నుంచి 4 రెట్లు అధికంగా సాగునీటిని వినియోగిస్తున్నాం. అంటే ఎంతగా వృధా చేస్తున్నామో అర్థం చేసుకోవచ్చు. ప్రధాన వ్యవసాయ ఉత్పత్తులైన ధాన్యం, చక్కెరను పండించడానికే పంజాబ్, మహారాష్ట్రలు నీటిని అవసరానికి మించి వాడుతున్నాయి. చివరకు పారిశ్రామిక, మానవ వినియోగానికి అవసరమయిన నీరు లభించని పరిస్థితి ఏర్పడు తున్నది. దీనికితోడు అపరిమితంగా నీటిని భూగర్భం నుంచి తోడడంవల్ల నీటికాలుష్యం కూడా ఆందోళనకరంగా పెరుగుతున్నది. దీనిని తాగిన ప్రజలు అనేక రోగాల బారిన పడి అనేకానేక అవస్థలకు గురవుతున్నారు. ఇజ్రాయిల్ లాంటి చిన్న దేశం వ్యవసాయ అవసరాలకోసం నీటిని ఎంతో పొదుపుగా టెక్నాలజీతో వాడుతున్నది. అక్కడ మంచినీటి, పారిశ్రామిక నీటి వినియోగానికి కూడా కఠిన నిబంధనలు అమల్లో ఉన్నాయి. సింగపూర్ లాంటి దేశాల్లో ఇంట్లో వాడే నీటికి కూడా మీటర్లను వినియోగిస్తారు. వాడకం మేరకే బిల్లులు అనడంతో ప్రజలంతా వృధా నీటి వినియోగానికి కత్తెర వేస్తున్నారు. అలాగే ఆ దేశం వాడిన నీటిని మళ్లీ పరిశుద్ధం చేసి వివిధ అవసరాలకోసం వాడుతున్నది. మరికొన్ని దేశాలు సముద్రంలోని ఉప్పునీటిని మంచినీటిగా మార్చే టెక్నాలజీని అమలు చేస్తున్నాయి. ఈ పరిస్థితుల్లో దేశమంతటా సమర్థ నీటి వినియోగ విధానం రావాలి. నీటిని పొదుపుచేసేవారికి ప్రోత్సాహకాలు అందచేయాలి. వ్యవసాయంలో నీటిని పొదుపుగా వాడేవారికి సబ్సిడీలు ఇవ్వాలి. చివరకు ఇళ్లల్లో వాడే నీటి వినియోగంపై కూడా ఆంక్షలు పెట్టి ఒకవైపు నీటిని పొదుపుగా వాడుతూనే మరోవైపు సరికొత్త టెక్నాలజీతో, అడవుల పెంపకంతో వర్షాలు నిరంతరం పడే పరిస్థితి తీసుకురావాలి.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ




# నీటి మంటలు!

– ఎ.వి.వి. ప్రసాద్

**కలహమేల మనకు కావేరి, కృష్ణపై**
**పంచుకొనుట తెలియ మంచి జరుగు;**
**మాటలున్నయపుడు మంటల పనియేల!**
**విశ్వవినుత నామ! వినురవేమ!!**

కర్ణాటక, తమిళనాడు ఇరుగు పొరుగు రాష్ట్రాలా? లేక పొరుగిట్టని దేశాలా? దాదాపు రెండు వారాలపాటు ఆ రెండు రాష్ట్రాల మధ్య నెలకొన్న ఉద్రిక్త పరిస్థితిని చూస్తే ఎవరికైనా ఇదే సందేహం కలుగుతుంది. తమిళులు, కన్నడిగులు ఒకే భాషా కుటుంబానికి చెందిన సోదరులే. రెండు రాష్ట్రాల మధ్య ఎలాంటి సరిహద్దు తగాదాలూ లేవు. అయినా బస్సులు భగ్గుమన్నాయి, దుకాణాలు దగ్ధమయ్యాయి, సరిహద్దులు మూసుకుపోయాయి, సర్వీసులు స్తంభించిపోయాయి. వారు వీరిని, వీరు వారిని కనిపిస్తే కొరికివేసే అనూహ్యమైన ఉద్రిక్త పరిస్థితి రెండు రాష్ట్రాల్లోను తాండవించింది. ముఖ్యంగా సెప్టెంబర్ 12, 13 తేదీలు, దానికి ముందు 6, 7 తేదీలు రెండు రాష్ట్రాల ప్రజలు ప్రత్యక్ష నరకాన్నే చవిచూశారు. ఈ తగాదాలకు అసలు బాధ్యులు ఎవరైనా, సాధారణ ప్రజలు దిక్కు తోచక నలిగిపోయారు, తల్లడిల్లిపోయారు. తమది కాని సమస్యలకు వారు నిలువునా బలైపోయారు. వేల సంఖ్యలో ఆందోళనకారులు రోడ్లమీదకు వచ్చి విధ్వంసకాండకు, దగ్ధకాండకు పాల్పడుతుంటే ఆ ఉన్మాదాన్ని అడ్డుకొనే 'మారాజు'లే లేకపోయారు. ప్రత్యేక భద్రతా దళాలను రప్పించి ఉండవచ్చు. కానీ వారు వచ్చే లోగానే రెండు రాష్ట్రాల్లోను పలుచోట్ల బూడిద కుప్పలు ప్రత్యక్షమయ్యాయి. సంయమనం పూర్తిగా లోపించి, నిగ్రహం పూర్తిగా కరవై పోయి క్రూరమృగాలు ఒకదానిపై మరొకటి పడి కుమ్ముకొన్నట్లు ఆందోళనకారులు చెలరేగిపోవడం చూస్తే ఎవరికైనా నిజంగానే ఆశ్చర్యం కలుగుతుంది. ఏ సిరియాలోనో, ఇరాక్‌లోనో ఉన్న అంతర్యుద్ధాలు గానీ, ఇజ్రాయెల్-పాలస్తీనా మధ్య ఉన్న సరిహద్దు తగాదాలుగానీ ఈ రెండు రాష్ట్రాలమధ్య లేవు అంతగా కొట్టుకొనడానికి. అయినా ఏ చిన్న వివాదం తలెత్తినా ఇలా చెలరేగిపోవడం ఇది మొదటిసారికాదు. ఆందోళనలు ఎప్పుడు జరిగినా తమిళనాడులోని కన్నడిగులపైనా, కర్ణాటకలోని తమిళులపైన పెద్ద ఎత్తున దాడులు జరగడం ఒక అలవాటుగా మారిపోయింది.



సమస్య ఎంత చిన్నదయినా దానిని భూతద్దంలోంచి చూసి ఒకరి ఆస్తులను మరొకరు ధ్వంసం చేసుకోవడం మామూలయిపోయింది. దీనంతటికి ప్రధాన కారణం- పాలకులు స్వప్రయోజనాలకోసం అన్ని సమస్యలను ప్రజలపైకి తోసివేయడమే. తాజా ఆందోళనలకు కారణమైన కావేరీజలాల వివాదం కూడా అటువంటిదే. రెండు రాష్ట్రాల మధ్య ఆ నదీజలాల పంపిణికి సంబంధించి రెండు ప్రభుత్వాలు చర్చల ద్వారానో, మరో సామరస్య పద్ధతిలోనో వివాదాన్ని పరిష్కరించుకోవచ్చు. లేదా సుప్రీంకోర్టు ఆదేశాలను పాటించవచ్చు. నచ్చక పోతే తిరిగి అప్పీలు చేసుకోవచ్చు. ఈలోగా వివాదాన్ని పరిశీలించ డానికి, పరిష్కరించడానికి ఏర్పాటు చేసుకొన్న ప్రత్యేక కమిటీలున్నాయి గనుక వాటి సలహాలు, సిఫారసులనూ అనుసరించవచ్చు. కానీ వాటన్నిటిని పక్కన పెట్టి రెండు రాష్ట్రాల ప్రజలు ఒకరిపై ఒకరు కత్తులు దూసుకునే పరిస్థితులు కల్పించడమేమిటి? ఒకవంక వివాదం కోర్టులో ఉన్నపుడు దాని నేపథ్యంలో రాజకీయ పార్టీలు ప్రజలమధ్య

..అధికార పార్టీ అండదండలు లేకుడా, రాజకీయ పక్షాల ఆసరా లేకుండా ఏ ఆందోళనలైనా జరిగే అవకాశమే లేదు. అటువంటప్పుడు ఈ విధ్వంసాలవల్ల జరిగే నష్టానికి ఆ పార్టీలే, ఆ రాజకీయ నాయకులే బాధ్యత వహించాలి. సాధారణ ప్రజలను, వారి ఆస్తులను వివాదాలకు బలిచేసే విధ్వంస సంస్కృతికి తెరపడాలంటే ప్రభుత్వ నేతలు ఏ అంతర్రాష్ట్ర సమస్యనైనా చర్చలద్వారా మాత్రమే పరిష్కరించే ప్రయత్నం చేయాలి. కానీ అది కొరవడడం వల్లనే రాష్ట్రాల విభజన జరిగి ఇన్ని దశాబ్దాలు గడచినా కావేరీ జలవివాదం వంటివి ఇంకా రగులుతూనే ఉన్నాయి. వాటిని సృష్టించిందీ ప్రజలు కాదు, పరిష్కరించేదీ ప్రజలు కాదు. కానీ ఆ తగాదాలకు ప్రాణలు కోల్పోతున్నదీ వారే, ఆస్తులను పోగొట్టుకొంటున్నదీ వారే. ఇలా ఎంత కాలం సాగాలి! ప్రజల శ్రేయస్సుకోసమే పని చేస్తున్నామనే ప్రభుత్వాలు ఈ విషయం గురించి ఎందుకు ఆలోచించవో మరి!

విద్వేషాలు రెచ్చగొట్టడమేమిటి? బెంగళూరు, కర్ణాటకలోని ఇతర ప్రాంతాల్లో చెలరేగిన ఆందోళనలు, విధ్వంసకాండవల్ల కేవలం ఒకే రోజున 25 వేల కోట్ల నష్టం సంభవించిందంటే, అల్లర్లలో ఇద్దరు ప్రాణాలు కోల్పోయారంటే దానికి బాధ్యులెవరు? పాలకులే కదా! సమస్యలకు శాశ్వత పరిష్కారాలు కనుగొన కుండా, సందర్భం వచ్చినప్పుడల్లా ఏవో ఉపశమన చర్యలు మాత్రమే తీసుకొనడంవల్ల ప్రతిసారీ ఇలా భారీ మూల్యం చెల్లించవలసి వస్తోంది. ఈ వాస్తవం పాలకులకు, అధికార పార్టీ నాయకులకు తెలియనిది కాకపోయినా షరా మామూలే. కేవలం రైతులు, సాధారణ ప్రజలైతే అంతటి విధ్వంసకాండకు పాల్పడలేరన్నదికూడా నిజమే. ఆ మాటున అసాంఘిక శక్తులు విజృంభించి శాంతిని విచ్ఛిన్నం చేయడం సర్వసాధారణమై పోయింది. రాజకీయ లబ్ధి పొందాలనుకొనే అవకాశవాదులు వివాదం నేపథ్యంలో తెరపైకి రావడంవల్లనే ఇంతటి భారీ నష్టం జరుగుతోందన్నది కూడా వాస్తవమే. ఆ అవకాశవాదులను నడిపిస్తున్నది ఎవరో వేరే చెప్పనక్కరలేదు. అధికార పార్టీ అండదండలు లేకుడా, రాజకీయ పక్షాల ఆసరా లేకుండా ఏ ఆందోళనలైనా జరిగే అవకాశమే లేదు. అటువంటప్పుడు ఈ విధ్వంసాలవల్ల జరిగే నష్టానికి ఆ పార్టీలే, ఆ రాజకీయ నాయకులే బాధ్యత వహించాలి. సాధారణ ప్రజలను, వారి ఆస్తులను వివాదాలకు బలిచేసే విధ్వంస సంస్కృతికి తెరపడాలంటే ప్రభుత్వ నేతలు ఏ అంతర్రాష్ట్ర సమస్యనైనా చర్చల ద్వారా మాత్రమే పరిష్కరించే ప్రయత్నం చేయాలి. కానీ అది కొరవడడం వల్లనే రాష్ట్రాల విభజన జరిగి ఇన్ని దశాబ్దాలు గడచినా కావేరీ జలవివాదం వంటివి ఇంకా రగులుతూనే ఉన్నాయి. వాటిని సృష్టించిందీ ప్రజలు కాదు, పరిష్కరించేదీ ప్రజలు కాదు. కానీ ఆ తగాదాలకు ప్రాణలు కోల్పోతున్నదీ వారే, ఆస్తులను పోగొట్టుకొంటున్నదీ వారే. ఇలా ఎంత కాలం సాగాలి! ప్రజల శ్రేయస్సు కోసమే పని చేస్తున్నామనే ప్రభుత్వాలు ఈ విషయం గురించి ఎందుకు ఆలోచించవో మరి!

**************

నిజమే! కావేరీజలాల వివాదం పన్నెండు దశాబ్దాలుగా రగులుతోంది. పది రోజులపాటు 15 వేల క్యూసెక్కుల చొప్పున కావేరీ జలాలు విడుదల చేయాలని సెప్టెంబర్ 5వ తేదీన సుప్రీంకోర్టు

ఆదేశాలు జారీ చేయడంతో తాజాగా వివాదం భగ్గుమంది. ఆ ఆదేశాల ప్రకారం కర్ణాటక ప్రభుత్వం తొలుత నీరు విడుదల చేయడంతో కర్ణాటకలోని కొన్ని ప్రాంతాల 'రైతులు' తమ ఆగ్రహాన్ని ప్రదర్శించారు. అది చినికి చినికి గాలివానయి అంతటి పెను నష్టానికి దారి తీసింది. ఆ విధ్వంసాలకు పాల్పడినవారు నిజంగా రైతులో కాదో ఆ ప్రభుత్వాలకే, ఆ పార్టీలకే తెలియాలి. కర్ణాటక సిఎం సిద్దరామయ్య, తమిళనాడు సిఎం జయలలిత అప్పీళ్లయితే చేశారుగానీ ముఖాముఖి చర్చలకు సిద్ధం కాలేకపోయారు. నీటి విడుదలపై కర్ణాటక తిరిగి సుప్రీంకు అప్పీలు చేసింది. దానిపై సర్వోన్నత న్యాయస్థానం సర్దిచెప్పి సవరించిన ఆదేశాలు జారీ చేసింది. అయినా అదే తగాదా. రెండు రాష్ట్రాల్లోను సెప్టెంబర్ 15దాకా పరిస్థితులు అదుపులోకి రానేలేదు. భూమి ఏదో బద్దలైపోతున్నట్లు ఇంత కల్లోలం అవసరమా?

ఎన్నో జలవివాదాలున్నా కేరళ, కర్ణాటక, తమిళనాడు, పుదుచ్చేరి మధ్య నలుగుతున్న కావేరీ జల వివాదమే ఇన్ని దశాబ్దాలనుంచి ఎంతో సంక్లిష్టం గామారుతోంది. వాటన్నిటిలోను కర్ణాటక, తమిళ నాడు మధ్యనే ఎక్కువ చిచ్చు రగులుతోంది. ఈ వివాదం పరిష్కారానికి ఒక ట్రిబ్యునల్ కూడా ఏర్పాటైంది. అది 2007లో మళ్లీ వివాదం తలెత్తని విధంగా కొన్ని సిఫార్సులను చేసింది. అయితే అవి ఎప్పుడూ సక్రమంగా అమలుగాక పోవడంతో వివాదం రావణకాష్టంలా మిగులుతోంది.



కావేరీ నదిమూలాలు కర్ణాటకలోనే ఉన్నా, నది పరివాహక ప్రాంతం ఎక్కువగా ఉన్నది తమిళనాడులోనే. చివరికి పుదుచ్చేరివద్ద సముద్రంలో కలుస్తూంటుంది. ఈలోగా నది ప్రవహించే ప్రాంతంలో ఏ రాష్ట్రం ఎంత నీటిని వాడుకోవాలన్న దానిపై కావేరీ జలాల ట్రిబ్యునల్ దాదాపు పదేళ్ల క్రితమే స్పష్టంగా పంపకాలు చేసింది. తమిళనాడుకు 479, కర్ణాటకకు 270, కేరళకు 30, పుదుచ్చేరికి 7 టిఎంసిల నీటిని కేటాయిస్తూ ట్రిబ్యునల్ జారీ చేసిన ఉత్తర్వులు కాగితాలకే పరిమితం కావడంతో, ఆ ఆదేశాలను పరీవాహక రాష్ట్రాలు ఖాతరు చేయకపోవడంతో వివాదం ఎప్పటికప్పుడే కొత్తదిగా కనిపిస్తోంది. తమిళనాడుకు ఏటా 192 టిఎంసిల నీటిని ఇవ్వడమేగాక, నెలకు ఇంత నీరివ్వాలని కూడా నిర్ణయించింది. కానీ ఈ పంపకంలో తనకు అన్యాయం జరిగిందంటూ కర్ణాటక పలుమార్లు న్యాయస్థానాలను ఆశ్రయించింది. చివరికి సుప్రీంకోర్టుకు కూడా వెళ్లింది. కానీ న్యాయస్థానాల్లో కూడా ఈ రాష్ట్రాలకు నీటి పంపకం సరైన రీతిలో జరగడం లేదన్నదే ఎక్కువమంది అభిప్రాయం. అందుకే మళ్లీ మళ్లీ వివాదం రగులుతోంది. మద్రాసు ప్రెసిడెన్సీ మైసూరుమధ్య 1892లో మొదటిసారి కావేరీ జలాలపై వివాదం తలెత్తి మూడు దశాబ్దాలు పైగా రగిలిన తర్వాత 1924లో తొలి ఒప్పందం కుదిరింది. అది మొదలు ఎన్నోసార్లు ఈ వివాదంపై ఉభయ రాష్ట్రాల మధ్య పలు ఒప్పందాలు జరిగాయిగానీ అవి ఏనాడూ సక్రమంగా అమలైన దాఖలాలు లేవు.

స్వాతంత్ర్యానంతరం ఆ రెండు రాష్ట్రాలతోపాటు కావేరీ బేసిన్ లోని కేరళ, పుదుచ్చేరి కూడా నీటి పంపకంకోసం డిమాండ్లు ఆరం భించాయి. దీనితో ఇది నాలుగు రాష్ట్రాల సమస్యగా మారిపోయి చాలా జటిలంగా తయారయింది. అప్పటినుంచి ఈ నదీ జలాల పంపకం కోసం చాలా కమిటీలే ఏర్పాటయ్యాయి. 1970లో కావేరీ జలాల అవసరాలపై ఏర్పాటైన నిజ నిర్ధారణ కమిటీ 1976లో తన నివేదికను ఇచ్చేసరికే ఈ వివాదం మరింతగా ముదిరిపోయింది. నిజ నిర్ధారణ కమిటీ నివేదికలోని అంశాలను ఉభయ రాష్ట్రాలు తొలుత అంగీకరించినా, తర్వాత తమిళనాడు ప్రభుత్వం తిరస్కరించడంతో సమస్య మళ్లీ మొదటికి వచ్చింది. మళ్లీ కమిటీలు, మళ్లీ సిఫారసులు మామూలే. ఇక ట్రిబ్యునల్ ఏర్పాటు చేయడమే మంచిదనుకొని 1986 నుంచి ప్రయత్నాలు ప్రారంభించినా, తర్వాత నాలుగేళ్లకుగాని అది కార్యరూపం దాల్చలేదు. అలా కొంత సమయం వివాదాలలోనే గడిచిపోయింది. 1991లో కావేరీ ట్రిబ్యునల్ మధ్యంతర ఉత్తర్వులు జారీ చేసినప్పటికి అవి కూడా నీరుగారిపోయాయి. 205 టిఎంసిల నీటిని తమిళనాడుకు ఇవ్వాలని ట్రిబ్యునల్ ఆ ఉత్తర్వులో పేర్కొంది. దానిపై ఆగ్రహించిన అప్పటి కర్ణాటక ప్రభుత్వం ఆ ఉత్తర్వులను రద్దు చేస్తూ ఆర్డినెన్స్‌ను జారీ చేసింది. ఆ సందర్భంగా ఉభయ రాష్ట్రాల్లోను ఆగ్రహ జ్వాలలు పెల్లుబికాయి. రాష్ట్రాల నీటిసెగ చివరికి కేంద్రాన్ని కూడా తాకడంతో చివరికి రాష్ట్రపతి కూడా అప్పట్లో జోక్యం చేసుకోవలసి వచ్చింది. రాష్ట్రపతి నాలుగు సందేహాలను రాజ్యాంగ ధర్మాసనానికి నివేదించడంతో కర్ణాటక రూపొందించిన చట్టం చెల్లబోదని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. ఆ సందర్భంగా మళ్లీ ఉభయ రాష్ట్రాల మధ్య ఆగ్రహ జ్వాలలు ఆకసాన్ని తాకాయి. వాజ్‌పేయి ప్రధానిగా ఉన్న సమయంలో మరోసారి రెండు రాష్ట్రాల మధ్య 'కావేరీ రాజీ' కుదర్చడానికి ప్రయత్నాలు జరిగాయిగాని అవీ ఫలించనేలేదు. 1998లో వాజ్‌పేయి నాయకత్వంలోనే కావేరీ జలాల ప్రాధికార సంస్థ కూడా ఏర్పాటైంది. ఆయన ఎంతో ఆలోచించి ప్రతిపాదించిన చతుస్సూత్ర పథకానికి రెండు రాష్ట్రాలు తొలుత తలాడించినా తర్వాత మళ్లీ ససేమిరా అన్నాయి. ట్రిబ్యునల్ ఈలోగా తనపని తాను చేస్తూ, పదహారేళ్లపాటు సుదీర్ఘ విచారణ చేపట్టి 2007 ఫిబ్రవరిలో నీటి కేటాయింపులపై తుది తీర్పు ఇచ్చింది. అయితే తర్వాత తమిళనాడు, కర్ణాటక ప్రభుత్వాలు దానిపై కూడా రివ్యూ పిటిషన్లు వేశాయి. వివాదం, సంక్షోభం తలెత్తి నపుడల్లా సుప్రీంకోర్టు జోక్యంచేసుకోవడం, ఆదేశాలు జారీ చేయడం, అవి కొంతకాలం అమలు జరిగి పరిస్థితి మళ్లీ మొదటికి రావడంతో కావేరీ జలాల వివాదం ఎప్పటికప్పుడు 'నిత్యనూతనం' గానే కనిపిస్తోంది. ట్రిబ్యునల్ ఉత్తర్వుల మేరకు తమిళనాడుకు సరిపడే నీటిని విడుదలచేయడంలో కర్ణాటక విఫలం కావడం, దానిపై మళ్లీ తగాదా తలెత్తడం పరిపాటయిపోయింది. అందుకే ఈ జల వివాదం ఇన్ని దశాబ్దాలయినా కొలిక్కి రాకుండా ఉండిపోయింది. గోదావరి, నర్మద, సట్లెజ్, వంశధార వంటి మరికొన్ని నదుల జలాల పంపకం విషయం లో కూడా వివాదాలు నడుస్తున్నా అవి కావేరిలా నిత్యం రగలడం లేదు. ఏదో ఒక పరిష్కారం వైపు ఆయారాష్ట్రాలు మొగ్గుచూపడంతో వాటి ప్రజలుకూడా శాంతియుత జీవనం సాగించ గలుగుతున్నారు. కానీ కావేరీ జలాల పంపకం విషయంలో మాత్రం తమిళనాడు, కర్ణాటకల్లోని ప్రభుత్వాలు (ఏ పార్టీ అధికారంలో ఉన్నా) తగినంత బాధ్యతాయుతంగా వ్యవహరించకపోవడం వల్లనే అది నిత్య వివాదంగా ఉండిపోతున్నదేమో! అనిపిస్తుంది.

నీరు ఎవరికైనా నిత్య అవసరమే. ప్రపంచంలోని 11శాతం అంటే 78.3 కోట్ల ప్రజలు గుక్కెడునీరైనా దొరకని దుర్భర పరిస్థితిలో ఉన్నారు. అయితే అదృష్టవశాత్తు భారతీయులకు, ముఖ్యంగా దక్షిణ భారతీయులకు నీటి సమస్య ఏర్పడని పరిస్థితే మొదటినుంచి ఉంది. ఎన్నో జీవనదులు సమృద్ధిగా పారుతున్నాయి. కానీ ఆ నీటిని పంచు కొనే విషయంలో రాష్ట్రాల ప్రభుత్వాలు సంకుచిత వైఖరితో వ్యవహ రించడం, కొన్ని పార్టీలు సొంత ప్రయోజనాల కోసం వివాదాలను పరిష్కరించకుండా అలాగే ఉంచివేయడంవల్లే 'కృత్రిమ కొరత' ఏర్పడి తగాదాలు తలెత్తుతున్నాయి. నిజంగా ప్రజాశ్రేయస్సు కాంక్షించే ప్రభుత్వాలైతే 'నీటికోసం ఇన్ని తగాదాలా? కూర్చుని మాట్లాడుకొం దాం, సామరస్యంగా పంచుకొందాం' అనుకోవాలి. కావేరీ కార్చిచ్చును ఇప్పటికైనా ఆర్పివేయడానికి జయలలిత, సిద్దరామయ్యలు పూనుకో వాలి. అలాగే కృష్ణను మరో కావేరి కానివ్వకుండా ఉభయతెలుగు రాష్ట్రాల అధినేతలు బాధ్యతతో మెలగవలసి ఉంది. ■



# హార్ట్ ఎ'టాక్'!

## గుండె ఆరోగ్యం గుప్పెట్లోనే..

కవర్‌స్టోరీ

శృంగవరపు రచన

**మనిషి శరీరంలో అత్యంత కీలకమైంది గుండె. అది లబ్‌డబ్‌మని పనిచేస్తున్నంత వరకే మనిషి జీవంతో ఉండేది. అటువంటి గుండె ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేస్తే ఆ వ్యక్తి తన ఆయువును తానే తుంచేసుకున్నట్లే. ఇటీవలికాలంలో హార్ట్ ఎటాక్' అనే మాట తరచు వినిపిస్తోంది. వయసుతో నిమిత్తంలేకుండా యువకులను, మధ్యవయసువారిని సైతం హార్ట్ ఎటాక్' ఎటాక్ చేస్తోంది. దానికి కారణాలు ఆయా వ్యక్తులకున్న ఆహారపు అలవాటు, ఇతర వ్యసనాలు ప్రధాన కారణాలు కాగా, పని ఒత్తిడి, మధుమేహం, రక్తపోటు వంటి ఇతర ఆరోగ్య సమస్యలు కూడా కొన్ని కేసుల్లో కారణాలవుతున్నాయి. వైద్యం కన్నా నివారణ మేలు. సెప్టెంబరు 29 'వరల్డ్ హార్ట్ డే' సందర్భంగా 'గుండెపోటు' (హార్ట్ ఎటాక్) గురించిన సవివర కథనం ఈవారం మీకోసం..**

ఆరోగ్యమే మహా భాగ్యం. మనిషికి ఏమి ఉన్నా, ఎన్ని ఉన్నా ఆరోగ్యం లేకపోతే ఎందుకూ పనికిరాడు. ఆరోగ్యంగా ఉంటే అడవిలోనైనా జీవించవచ్చు. మనిషికే కాదు ప్రపంచంలో ప్రతిజీవికీ ఇదే సూత్రం మనుగడలో ముఖ్యమైంది. అయితే ఇటీవలి కాలంలో ప్రపంచవ్యాప్తంగా అధికంగా కలవరపెడుతోంది 'హార్ట్ ఎటాక్'.

గుండెకి సంబంధించిన వ్యాధుల వలన ప్రపంచవ్యాప్తంగా మరణాల సంఖ్య పెరిగిపోతున్న కారణంగా, సామాన్య మానవాళిలో ఈ వ్యాధులకు సంబంధించిన జాగరూకత కలిగించాలన్న లక్ష్యంతో ప్రతి సంవత్సరం సెప్టెంబరు 29న ప్రపంచ మంతా 'వరల్డ్ హార్ట్ డే' జరుపుకుంటారు.

1946లో జెనీవాలో ది వరల్డ్ హార్ట్ ఫెడరేషన్ పెరిగిపోతున్న గుండెజబ్బులపై ప్రజలలో అవగాహన కల్పించాలన్న సంకల్పంతో ఈ కార్యక్రమం మొదలుపెట్టింది.



ప్రపంచవ్యాప్తంగా ఈ సంస్థ 100 దేశాల్లో 196 కార్డియాలజీ సొసైటీలను ఏర్పాటుచేసింది. సుమారు 17.3 మిలియన్ ప్రజల మరణానికి కారణం అవుతున్న గుండె జబ్బుల పట్ల ప్రజలలో అవగాహన కల్పించడానికి 2000 సంవత్సరం నుండి ఏటా సెప్టెంబరు 29న 'వరల్డ్ హార్ట్ డే' జరుపుతున్నారు.

ఈ సందర్భంగా అసలు గుండె జబ్బులు రావడానికి కారణా లేమిటి? దాని లక్షణాలేమిటి? గుండెపోటు రాకుండా ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి? తదితర వివరాలను ఇక్కడ మనం తెలుసుకుందాం.

### గుండెపోటు లక్షణాలు:

సుమారు 60శాతానికి పైగా గుండెనొప్పి లక్షణాలు, గుండెపోటు సంభవించక ముందే అనుభవం అవుతాయని ఒక పరిశీలనలో తెలిసింది. కానీ తరచూ ముందుగా వచ్చే ఈ లక్షణాలను పట్టించుకోక అశ్రద్ధ చేస్తారని కూడా పరిశీలనలో తెలిసింది.

### గుండెనొప్పి ఎలా ఉంటుంది?

గట్టిగా పిండినట్టు, తీవ్రమైన ఒత్తిడితో ఉంటుంది. ఇలాంటి నొప్పి ఛాతీ మధ్యలో ఉంటుంది. ఈ నొప్పి కొద్ది నిమిషాలు ఉండవచ్చు. గుండె వేగంగా కొట్టుకోవడం అంటే సాధారణంగా కొట్టుకునే వేగం కన్నా ఎక్కువగా కొటుకుంటుంది.

**అసౌకర్యం:** గుండెనొప్పితో బాటు చాలా అసౌకర్యంగా, అవిశ్రాంతంగా బాధ ఉంటుంది.

**మిగతా భాగాలలో నొప్పి:** లోపలి కదుపులో నొప్పి..ఈ నొప్పి

పైభాగంలో ఉన్న గుండెనొప్పి కలిగించే వత్తిడి వల్ల, కింద ఉన్న పొట్ట లేక జీర్ణాశయంలో ఉన్నట్టు అనిపించవచ్చు. అందుకనే ఇలాంటి నొప్పిని అశ్రద్ధ చేస్తుంటాం. ఇలాంటి నొప్పిని 'రిఫర్డ్ పెయిన్' అంటారు.

ఇటువంటి నొప్పి భుజాలకి, ప్రత్యేకించి ఎడమ భుజానికి ఎడమ చేతికి, ఎడమ ముంజేతికీ పాకవచ్చు. అలాగే వీపు భాగానికి, రెండు చేతి రెక్కల మధ్య భాగానికి పాకవచ్చు.

ఇలా గుండెలో మొదలైన నొప్పి శరీరంలో మిగతా భాగాలకు పాకటానికి కారణం గుండెకు మిగతా శరీర భాగాలకు నొప్పిని తెలియజేసే నాడులు ఒకటే అవటం వలన, ఊపిరి అందకపోవడమూ, కళ్లు తిరిగినట్టూ, తల తిరిగినట్టూ, ఆత్రుతగా ఉండటం, వాంతులు రావటం, చమటలు పట్టడం, తిన్న ఆహారం అరగనట్టు అన్పించడం కూడా జరగవచ్చు. ఈ లక్షణాలు సాధారణంగా కనిపించేవి. కానీ...హార్ట్ ఎటాక్ లేక గుండెపోటు లక్షణాలు కొద్ది తీవ్రత నుండి చాలా తీవ్రతతో ఉండి విపరీతమైన నొప్పి కూడా కల్గించవచ్చు. అలాకాకుండా పురుషులలో నాల్గవ వంతు కేసులలో ఈ లక్షణాలు ఏవీ లేకుండా కూడా సంభవించవచ్చు. దీనిని 'సైలెంట్ మయో కార్డియల్ ఇంఫార్క్షన్' అంటారు. ఎందుకంటే.. ఏ లక్షణాలు లేకుండా నిశ్శబ్దంగా వస్తుంది కనుక. అందువల్ల ఛాతీలో నొప్పి ఎప్పుడు వచ్చినా, లేక అనుమానంగా ఉన్నా వెంటనే వైద్య సహాయం తీసుకోవాలి.

**ప్రథమ చికిత్సే ఆపన్నహస్తం:**

అన్ని రోగాల్లా చెప్పివచ్చేది కాదు గుండెపోటు. టైమివ్వదు. ఎక్కువ సమయం గడిచిందంటే ప్రాణహాని ఖాయం. ఇప్పటికీ గుండెపోటు వచ్చే ముందు లక్షణాలు ఇవి అని కచ్చితంగా చెప్పటం కష్టం అంటున్నారు వైద్యులు. అయితే వైద్యరంగం బాగా అభివృద్ధి చెందిన ఈరోజుల్లో గుండెపోటును ముందుగా గుర్తించి జాగ్రత్తలు తీసుకోలేమా? అంటే కొన్ని సూచనలు ఉన్నాయంటున్నారు వైద్య నిపుణులు.

ఒక్కోసారి స్ట్రోక్ లక్షణాలు గుర్తించడం కష్టం. అందులోనూ అవగాహన లేమి మరింత ప్రమాదకరం. ఇలా గుర్తించలేకపోవడం వల్ల స్ట్రోక్ వచ్చిన వారి మెదడు తీవ్రంగా దెబ్బతినే ప్రమాదం ఉంది.




రోగితోబాటు ఉన్నవారు, మూడు లక్షణాలను బట్టి ఆ వ్యక్తి స్ట్రోక్‌కు గురయ్యారన్న విషయం గ్రహించవచ్చు.

1.ముందుగా ఆ వ్యక్తిని నవ్వమనండి.

2.చిన్న వాక్యం స్పష్టంగా మాట్లాడమనండి.

3.రెండుచేతులూ పైకి ఎత్తమనండి.

పై వాటిలో ఏ ఒక్కపని చెయ్యడంలో విఫలం అయినా వెంటనే అంబులెన్స్‌ని పిలవండి. వారికి తక్షణ వైద్యసహాయం అందించండి. ముఖ్యంగా తెలుసుకోవాల్సింది స్ట్రోక్‌కి గురైన వారిని నోరు తెరవమనండి. నాలుక మెలి తిరిగి ఉన్నా, పక్కకి తిరిగి ఉన్నా, అది గుండెపోటుగా భావించి నిమిషాల వేగంతో హాస్పిటల్‌లో జాయిన్ చేయండి. ఆలస్యం కాకుండా ఆసుపత్రికి తీసుకెళ్లటం ముఖ్యం.

* అత్యవసర సర్వీస్ నంబరుకి ఫోన్ చేయండి.
* రోగి దుస్తులను వదులు చేయండి.
* రోగిని కంగారుపెట్టకుండా ధైర్యం చెప్పండి.
* కొంచెం వంగి కూర్చున్న భంగిమని ఏర్పాటుచేయండి.
* అనవసర కదలికల్లేకుండా చూడండి.
* ఆక్సిజన్ ఏర్పాటుచేయండి.



* వెంటనే హృద్రోగ నిపుణులున్న ఆసుపత్రికి తరలించండి.
* దొరికితే సార్బిట్రేట్ మాత్ర నాలుక కింద పెట్టడం చేయాలి.

గుండెపోటును మయో కార్డియలల్ ఇన్‌ఫ్రాక్షన్ లేదా కార్డియాక్ ఇన్‌ఫ్రాక్షన్, కరొనరీ త్రాంబోసిస్ అని అంటారు. రక్తనాళాలలో మొద్దుబారిన లేదా చనిపోయిన కణజాలం వలన గుండెకు రక్తప్రసరకణలో అవరోధం కలగడాన్ని కరోనరీ త్రాంబోసిస్ అంటారు.

**కారణాలు:** హార్ట్ ఎటాక్‌కి అవకాశముండే కొన్ని కారణాలు..

వయసు: మగవారిలో 45 సంవత్సరాలు, స్త్రీలలో 55 సంవత్సరాలు పైబడిన వారిలో వచ్చే అవకాశం ఉంటుంది.

**ఏంజినా:** గుండెకి తగినంతగా ఆక్సిజన్ సరఫరా లేని కారణంగా ఛాతీ నొప్పి కలుగుతుంది. ఇది గుండెపోటులా అనిపిస్తుంది. మందుల వల్ల తగ్గిపోతుంది. ఏంజినా వలన హార్ట్ ఎటాక్ రిస్క్ పెరుగుతుంది.

**కొలెస్ట్రాల్ ప్రమాణాలు పెరగటం వల్ల...**
కొవ్వు పరిమాణం పెరగటం వల్ల హార్ట్ ఎటాక్ వచ్చే అవకాశాలు ఎక్కువ. ఎందుకంటే గుండెకి రక్తం సరఫరా చేసే రక్తనాళాల్లోపల రక్తం గడ్డలు కట్టే ప్రమాదం ఉంటుంది.

**మధుమేహవ్యాధి:**
మధుమేహవ్యాధి ఉన్న వారిలో గుండెపోటు వచ్చే అవకాశాలు అధికంగా ఉన్నాయి.

**ఆహారం:**
కొవ్వు ఎక్కువగా ఉండే ఆహారం, జంక్‌ఫుడ్, నూనెలు, మాంసం అధికంగా తినేవాళ్లలో రిస్క్ అధికం.

**వంశపారంపర్యం:**
ఆనువంశికంగా కూడా గుండెపోటు వచ్చే అవకాశం ఉంది.
రక్తపోటు, అధిక బరువు, ధూమపానం, మద్యపానం, హెచ్.ఐ.వి. కారణాల వల్ల 50శాతం గుండెపోటు వచ్చే అవకాశం ఉంటుంది.

**పని వత్తిడి:** పనిలో ఒత్తిడి, షిఫ్టు ఉద్యోగాలు చేసేవారిలో హార్ట్ ఎటాక్ వచ్చే అవకాశాలు అధికంగా ఉంటాయి.

**ఒకసారి ఎటాక్ వచ్చాక...**
ఒకసారి హార్ట్ ఎటాక్ వచ్చిన వారిలో మళ్లీ, మళ్లీ హార్ట్ ఎటాక్ వచ్చే ప్రమాదం ఎక్కువ.

**నిర్ధారణ:** గుండెపోటు లక్షణాలు పసిగట్టిన వెంటనే రోగికి దగ్గరలో ఉన్న ఆసుపత్రికి తరలించాలి.

**పరీక్షలు:**
ఇసిజి..., కార్డియాక్ ఎంజైము పరీక్షలు, ఛాతీ ఎక్స్‌రేల ద్వారా గుండెపోటును నిర్ధారిస్తారు. దాన్ని బట్టి ఎటువంటి చికిత్స చేయాలన్నది నిర్ణయిస్తారు.




## గుండెపోటు వచ్చిన వ్యక్తికి వైద్యం:

గుండెపోటు వచ్చిన కొంతమంది రోగులు శ్వాస పీల్చుకోలేకపోతారు. కదలలేరు, ముట్టుకున్నా, మాట్లాడించినా స్పందించరు. దగ్గు వస్తుంది. ఇలాంటి కేసుల్లో సి.పి.ఆర్. (కార్డియో పల్మనరీ రిసస్‌టేషన్) చేస్తారు. ఇందులో చెస్ట్ కంప్రెషన్స్ వలన నిమిషానికి 100 సార్లు గుండె కొట్టుకోవటం మొదలవుతుంది. డిఫ్రైబ్రిలేటర్‌తో రోగి ఛాతికి ఎలక్ట్రిక్ షాక్ ఇచ్చి గుండె మామూలుగా పనిచేసేలా చేస్తారు. హార్ట్ ఎటాక్ సమయంలో ఏస్ప్రిన్ టాబ్లెట్ ఇస్తారు. ఇది రక్తాన్ని పలచబడేలా, ప్రసరణ జరిగేలా చేస్తుంది.
త్రాంబోలైటిక్స్‌తో రక్తం గడ్డలను కరిగించి, రక్తం పలచబడేలా చేస్తారు. రోగి ఆదుర్దాని తగ్గించడానికి రోగికి కొన్ని సమయాల్లో మార్ఫిన్ ఇస్తారు.
గుండెపోటు రోగులకి వివిధరకాల వైద్యం అందుబాటులో ఉంది. వ్యాధి తీవ్రత, రోగి పరిస్థితిని బట్టి, మళ్లీ గుండెపోటు రాకుండా కాపాడే విధంగా వైద్యం ఉటుంది.
ఏస్ప్రిన్, యాంటీ ప్లేట్‌లెట్స్ వల్ల రక్తం గడ్డకట్టే అవకాశాలు తగ్గుతాయి. బీటా బ్లాకర్స్ వల్ల హార్ట్ బీట్ వేగం తగ్గుతుంది. అవసరాన్ని బట్టి ఏంజియో టెన్సిన్-కన్వర్టింగ్ ఎంజైమ్) ఉపయోగిస్తారు.
రక్తనాళాలను తెరచి రక్తప్రసరణని అడ్డుకునే గోడలను తొలగించడానికి ఇన్హిబిటర్స్‌ను వాడతారు.
రక్తంలో కొలెస్ట్రాల్ ప్రమాణాలు తగ్గించేందుకు స్టాటిన్స్ వాడతారు.



## రోగి గుండె ఎక్కువ ప్రమాదకరంగా ఉన్న సమయాల్లో...

**యాంజియోప్లాస్టీ:** శస్త్ర చికిత్స ద్వారా కరోనరీ ఆర్టరీని తెరిచి, చిన్న వైరు అందులోకి ప్రవేశపెట్టి, లోపల అడ్డుగా ఉన్న గడ్డల వరకు

# హృద్రోగులు అమెరికాలోనే ఎక్కువ...

ప్రపంచంలో హార్ట్ ఎటాక్ రోగులు అమెరికాలో ఎక్కువ. 47శాతం రోగులు సడెన్ హార్ట్ ఎటాక్ వలన ఆసుపత్రికి వెళ్లకుండానే మరణిస్తున్నారు. ఇందుకు కారణాలు వారి జీవన విధానం, ఆహారపు అలవాట్లు అని గణాంకాలు తెలుపుతున్నాయి. అధికబరువు, ధూమపానం, అనారోగ్య ఆహారపు అలవాట్లు, మద్యపానం ఎక్కువగా ఉండటం వలన అమెరికాలో గుండెజబ్బులు నానాటికీ అధికమవుతున్నాయి.

అమెరికాలో క్యాన్సర్ తరువాత ఎక్కువమంది హార్ట్ ఎటాక్‌లతోనే మరణిస్తున్నారు. మరణాల శాతాన్ని పరిశీలిస్తే అమెరికన్ ఇండియన్స్ (అలస్కావారు) 18.4 శాతం, ఆసియాకి చెందిన వారు 22.2శాతం, నల్లజాతి వారు 23.8శాతం, తెల్లవారు 23.5శాతం, మిగిలిన వారు 23.5శాతంగా ఉన్నారు. ప్రతిసంవత్సరం అమెరికాలో ఆరులక్షలకు పైగా మరణాలు హార్ట్ ఎటాక్ వల్లనే సంభవిస్తున్నాయి. అంటే ప్రతి నలుగురిలో ఒకరు. గుండెజబ్బుల వలన మరణించేవారిలో పురుషులు, స్త్రీలూ కూడా ఎక్కువే ఉన్నారు. కరోనరి హార్ట్ వ్యాధి వలన ఏటా 3,70,000 మంది మరణిస్తున్నారని అంచనా.

ప్రతి సంవత్సరం 7 లక్షలకు పైగా అమెరికన్లు హార్ట్ ఎటాక్‌కి గురవుతున్నారు. అందులో 5 లక్షలకు పైగా మొదటిసారి హార్ట్ ఎటాక్ వచ్చిన వారయితే, 2 లక్షలకు పైగా రెండోసారి హార్ట్ ఎటాక్ వచ్చినవారు కావడం విశేషం.

పంపి, చిన్న బెలూన్‌ద్వారా గోడలని తొలగిస్తారు. మూసుకు పోయిన రక్తనాళాలు తెరుచుకునేలా ఫ్లెక్సిబుల్ మెటల్ మెష్ (దీన్నే స్టంట్ అంటారు) అమర్చి, ఆర్టరీ తెరుచుకునేలా చేస్తారు.

**సి.ఎ.బి.జి. (కరోనరీ ఆర్టరీ బైపాస్ గ్రాఫ్ట్):**

పాడైపోయిన రక్తనాళాన్ని బైపాస్ చేసి..శరీరంలో ఇతర ప్రాంతాలనుండి తొలగించిన రక్తనాళాన్ని అమరుస్తారు. దీని వలన మామూలుగా గుండెకి రక్తప్రసరణ జరుగుతుంది.

**గుండెపోటు తర్వాత...**

గుండెపోటుకు వైద్యం జరిగాక రోగి కోలుకోవడం క్రమంగా, నెమ్మదిగా జరుగుతుంది. దీనికి వైద్యులు, డైటీషియన్లు, నర్సులు, ఫిజియో థెరపిస్టులు, పర్సనల్ ట్రైనర్ల ఆసరా అవసరం.

**భౌతిక శ్రమ:**

హార్ట ఎటాక్ వచ్చి కోలుకున్నాక రోగి చురుగ్గా ఉండే ప్రయత్నం చెయ్యాలి. చిన్నచిన్న ఎక్సర్‌సైజులు..స్పెషలిస్టుల పర్యవేక్షణలో ప్రారంభించాలి.

**పనికి వెళ్లటం:**

ఇది చేసే పనిమీద, వచ్చిన హార్ట్ ఎటాక్ తీవ్రత మీద ఆధారపడి ఉంటుంది.

**డిప్రెషన్:**

చాలామంది హార్ట్ ఎటాక్ వచ్చిన వాళ్లలో డిప్రెషన్ తలెత్తుతుంది.. నిరాశ, నిస్పృహ, మనోధైర్యం లేకపోవటం వంటివి కలిగినపుడు వైద్యుణ్ని సంప్రదించాలి.

**డ్రైవింగ్:**

హార్ట్ ఎటాక్ వచ్చిన రోగులు కనీసం 4 వారాల వరకు డ్రైవింగ్ చెయ్యరాదని నిపుణులు చెపుతున్నారు.

**సెక్స్:**

చాలామంది మగవారిలో గుండెపోటు తర్వాత, సర్జరీ తర్వాత అంగస్తంభనం సమస్య తలెత్తుతుంది. సెక్సులో పాల్గొంటే మరోసారి హార్ట్ ఎటాక్ వస్తుందన్నది అపోహ మాత్రమే. వైద్యం సహాయంతో మరల ఆనందమయ శృంగారంలో పాల్గొనవచ్చు.

హార్ట్ ఎటాక్ వచ్చిన తర్వాత తలెత్తే సమస్యలు..

**ఏర్విల్‌మయాస్:** హార్ట్ బీట్స్ అధికంగా లేదా నెమ్మదిగా ఉండడం..సమస్య తలెత్తుతుంది. చాలామందిలో తక్కువ సమయంలోనే ఈ సమస్య తగ్గిపోతుంది.

**కార్డియాక్ షాక్:** రక్తపోటు (బి.పి.) ప్రమాదస్థాయిలో తగ్గుతుంది. అంటే గుండెలో శరీరంలోని ఇతర భాగాలకు తగినంతగా రక్తం సరఫరా చేయలేకపోవడం వలన తలెత్తే సమస్య ఇది.

**హైపోక్సేమియా:** రక్తంలో ఆక్సిజన్ ప్రమాణాలు తగ్గిపోవటం.

**పల్మనరీ ఎడీమా:** ఊపిరితిత్తులు చుట్టూ ద్రవాలు చేరడం.

**డి.వి.టి (డీప్ వెయిన్ త్రాంబోసిస్)**

కాళ్ల దగ్గర, పెల్విస్ దగ్గర రక్తం గడ్డకట్టి రక్తప్రసరణను నిరోధించడం.

ప్రపంచవ్యాప్తంగా మరణాల సంఖ్యని అధికం చేస్తున్న వ్యాధి కార్డియో వాస్కులార్ డిసీజ్. ఎక్కువమంది ఈవ్యాధి వల్లనే మరణిస్తున్నారు. 2012 గణాంకాల ప్రకారం 17.5 మిలియన్ రోగులు ఈ వ్యాధివల్లనే మరణిస్తున్నారు.

గుండెజబ్బుల రిస్క్ అధికంగా ఉన్న దేశాల్లో ప్రథమస్థానంలో టర్క్‌మెనిస్థాన్ ఉంది. ఇక భారత్‌లో 30 మిలియన్ల మంది గుండెజబ్బుతో బాధపడుతు న్నారు. వీరిలో 14 మిలియన్ల మంది పట్టణప్రాంతాల్లో ఉండగా, 116 మిలియన్లమంది గ్రామీణ ప్రాంతాల్లో ఉన్నట్లు గణాంకాలు తెలుపుతున్నాయి.



భారత ఉపరాష్ట్రపతి హమీద్ అన్సారీ ప్రపంచ హార్ట్ డే సందర్భంగా సందేశమిస్తూ...నానాటికీ పెరిగిపోతున్న గుండెజబ్బులపై దృష్టి సారించామని, గుండెజబ్బుల నివారణకు తగినన్ని వసతులు కల్పించాలని, అవగాహన కల్గించాలని, ఆరోగ్య వనరులు సమకూర్చాలని, దీనికి ప్రభుత్వ, ప్రైవేట్ సెక్టార్లు సహకరించాలని కోరారు. ప్రస్తుతం మనదేశంలో ఉన్న వసతులు చాలవని, గుండెజబ్బులకు వైద్యం సామాన్యులకు అందుబాటులోకి తేవాలని చెప్పారు. ఇక గుండె జబ్బులు రాకుండా ముందే జాగ్రత్తపడవలసిన అవసరం ఎంతైనా ఉంది. ధూమపానం, మద్యపానం వంటి వాటిపై చట్టాలను కఠినతరం చేసి అదుపుచెయ్యాల్సిన అవసరం ఉంది. గుండెజబ్బులు వచ్చినవారు వైద్యం గురించి అవగాహన ఏర్పరచుకోవాలి. గుండె శస్త్రచికిత్స తర్వాత పాటించాల్సిన జాగ్రత్తలు, ఆహారం, వ్యాయామం వంటి విషయాల మీద దృష్టి సారిస్తే 2020 నాటికి గుండెజబ్బులతో మరణించేవారి సంఖ్య గణనీయంగా తగ్గించవచ్చని అన్సారీ అభిప్రాయపడ్డారు.

**గుండెను పదిలంగా కాపాడుకోవాలంటే..**

* ఆహారం మితంగా తీసుకోవాలి.
* పళ్లు, కాయగూరలు, తక్కువ కాలరీలు ఉండే ఆహారం, పీచుపదార్థాలు, తక్కువ ఉప్పు ఉండే ఆహారం తీసుకోవాలి.
* మీ ఆహారపు అలవాట్లు, మీ శరీర పరిమాణం, బరువు, ఛాతీ, జఘన భాగాలు చూస్తే తెలిసిపోతాయి.
* పీచుపదార్థాలు అధికంగా ఉండే గింజలు, గోధుమ, బార్లీ, ఓట్లు వంటివి తినాలి. ఆకుకూరలు సమృద్ధిగా తీసుకోవాలి.
* నూనెలు ఎక్కువగా వాడరాదు. రిఫైన్డ్ నూనెలు, రికమెండ్ చేసినవే వాడాలి.
* మాంసం, తదితర ఆహారాలు, వెన్న, నెయ్యి, పిండిపదార్థాలు, దుంపలు వంటివి తగ్గించాలి.
* వ్యాయామం, వాకింగ్ క్రమం తప్పకుండా చేయాలి.
* ఒత్తిడికి దూరంగా ఉండాలి.
* వేళకి ఆహారం, నిద్ర, వ్యాయామ నియమం తప్పకుండా పాటించాలి.

ఏమైనా చేతులు కాలాక ఆకులు పట్టుకునే రీతిలో కాకుండా గుండెపోటు రాకుండా మొదటినుంచి ఎవరికి వారు గుండె ఆరోగ్యం పట్ల అవగాహనతో మంచి ఆహారపు అలవాట్లతో, పొగ తాగకుండా, మద్యపానానికి దూరంగా ఉండటం ఎంతైనా మంచిది. మీ గుండె ఆరోగ్యం మీ గుప్పెట్లోనే ఉందన్నది మరువకండి. ■

లోకం లోగిలిలో...

# భార్యకు కానుకగా బస్సు!




బస్సుల్లో పరిచయాలు క్రమంగా ప్రేమకు, ఆ తర్వాత పెళ్లికి దారితీయటం మామూలే. అయితే కెన్ అనే పెద్దమనిషి ఓ అరవై ఏళ్ల కిందట బస్సు కండక్టరుతో తొలిచూపులోనే ప్రేమలో పడ్డాడట. కండక్టర్ పేరు షిర్లే మోర్గాన్. అది 1956. గ్లూసెస్టర్, కార్డిఫ్‌ల మధ్య నడిచే రెడ్ అండ్ వైట్ రూట్‌లో కెన్, నీలికళ్లతో ఎంతో అందంగా ఉన్న షిర్లేను చూడటం జరిగింది. 60 మైళ్ల ప్రయాణంలో ఆమెతో ఎంతో మాట్లాడాడుకానీ ఆమెకు బాయ్ ఫ్రెండ్ ఉన్నాడేమో తెలుసుకోవటానికి ధైర్యం చాల్లేదట. ఆ తర్వాత ఆమెను మరువలేక మళ్లీ ఖర్చయినా కూడా ఆ బస్సు ఎక్కి, కొన్నిరోజులకు ధైర్యం పుంజుకుని సినిమా కెళదామని ప్రపోజ్ చేయటం ఆమె అంగీక రించటం జరిగాయి. అలా ప్రేమ పాకాన పడింది. కెన్ రాయల్ ఎయిర్ ఫోర్స్‌లోని తన ఉద్యోగాన్ని వీడి, షిర్లేతో కలిసి పనిచేయడం కోసం బస్ డ్రైవర్ అయ్యాడు. ప్రేమజంట పెళ్లిచేసుకున్నారు. అరవై ఏళ్లు ఆనందంగా గడిచాయి. ట్రాన్స్‌పోర్ట్ మ్యూజియంలో అటువంటి బస్సును చూసి తమ తొలి పరిచయం గుర్తుగా ఆ బస్సును ఆమెకు కానుకగా కొనివ్వాలనుకున్నాడు కెన్. కొనిచ్చాడు కూడా. తిరిగి ఇద్దరూ డ్రైవర్, కండక్టర్లుగా టూర్లు కూడా నడపటం విశేషం.



# శునకం థీమ్‌తో హోటల్



ఇడాహోలో ఓ చిన్ని హోటల్ ఉంది. చిన్ని హోటళ్లు ఈ ప్రపంచంలో ఎన్నో ఉన్నాయి, ఏమిటి దీని గొప్ప అంటే... ఇది చెక్కతో పెద్ద కుక్క ఆకారంలో నిర్మితమైన హోటల్. దీని పేరు డాగ్ బార్క్ పార్క్ ఇన్. ఇందులో రెండు బెడ్‌రూమ్‌లు, ఒక బాత్‌రూమ్ ఉన్నాయి. రెండో బెడ్ రూమ్ సరిగ్గా కుక్క నోటి భాగంలో ఉంటుంది. భార్యాభర్తలైన డెన్నిస్ సల్లివాన్, ఫ్రాన్సిస్ కాంక్లిన్ దీన్ని నిర్మించారు. ఇద్దరూ చెక్కపనిలో అందెవేసిన కళాకారులు కావడం విశేషం. ఇందులో ఓ రాత్రి బసచేయడానికి 98 యుఎస్ డాలర్లు చెల్లించాల్సి ఉంటుంది. ఇక లిటిల్ పప్పీ టోబీ షో కోసమే కానీ గెస్టులు బుక్ చేసుకోవటానికి కాదు. ఇడాహోలోని కాటన్‌వుడ్‌లో ఉన్న ఈ హోటల్‌ను డెన్నిస్ దంపతులు 2003లో ప్రారంభించారు. అతిథులు తమ లగేజ్‌తో మెట్లు ఎక్కగానే శునకం పొట్టభాగంలోకి ప్రవేశిస్తారు. బెడ్‌రూమ్‌లోని మంచానికి తలవైపున ఉండే బోర్డులాంటి భాగంలో దాదాపు 26 శునకాల బొమ్మల్ని చెక్కారు. ఇక్కడ వైఫై ఉంది కానీ, ఫోన్ కాని, టెలివిజన్ కానీ లేవు. ఇక్కడ బస చేయడానికి వచ్చేవారు తమ పెంపుడు జంతువుల్ని తెచ్చుకోవచ్చు కానీ దానికి ముందుగా హోటల్ వారి అనుమతి తీసుకోవాలి, అంతేకాదు, అందుకోసం అదనంగా 15 యుఎస్ డాలర్లను చెల్లించాల్సి ఉంటుంది. తలగడలపై కూడా శునకాల ఆకారంలో కుకీలు కూడా ఏర్పాటుచేసారు.

# గోల్డ్ టాయ్‌లెట్

గోల్డ్‌తో తయారైన అనేకానేక వస్తువుల్ని, నిర్మాణాల గురించి విని ఉన్నారేమో కానీ గోల్డ్ టాయ్‌లెట్ గురించి విన్నారా! న్యూయార్క్‌లోని గుగెన్‌హీమ్ మ్యూజియంలో 18 క్యారెట్ల గోల్డ్ టాయ్‌లెట్‌ను ఏర్పాటుచేశారు. ఇటాలియన్ ఆర్టిస్టు మారిజియో కాటలాన్ దీన్ని రూపొందించాడు. మిలన్‌కు చెందిన కాటలాన్ దీనిగురించి మాట్లాడుతూ ఆర్థిక అసమానతలే తనను దీని తయారీకి పురికొల్పాయంటాడు. ఓ ట్రక్ డ్రైవర్ కొడుకైన మారిజియో ఆర్థిక అసమానతలను ఫ్లష్ చేయాలన్నదే తన కోరిక అంటాడు. మ్యూజియం అడ్మిషన్‌కు డబ్బు చెల్లించిన వారు ఈ గోల్డ్ టాయ్‌లెట్‌ను వినియోగించుకోవచ్చు.



## కృతి

# చదవతగ్గ వ్యాసాలు



తెలుగంటే తెలంగాణదేనన్న భావంతో ఆ భాషను, ముఖ్యంగా తెలంగాణ ప్రజల భాషను రక్షిం చుకోవా లన్న సద్దుదేశంతో ప్రముఖ రచయిత డా. కాలువ మల్లయ్య వివిధపత్రికల్లో అచ్చయిన తన 15 వ్యాసా లను ఓ సంకలనంగా 'తెలంగాణ -భాష, చదువుల తల్లి' మకుటంతో వెలువరించారు. 1968లో స్థాపించిన తెలుగు అకాడెమీ' తెలుగు భాషాభివృద్ధికి చేస్తున్న నిర్వి రామ కృషిని వివరిస్తూ, విశ్లేషిస్తూ అయిదు వ్యాసాలు పొందుపరిచా రు. ఎట్టి పరిస్థితుల్లోనూ తెలుగు అకాడెమీ స్థాయిని కుదించవద్దని, దాని స్థాయిని డీమ్డ్ యూనివర్సిటీ స్థాయికి ఉన్నతీకరించవలసిన అవ సరం ఉందని సూచిస్తూ, అకాడెమీని భాష, చదువులతల్లి'గా అభివ ర్ణించారు. భాషకు ఓ ప్రత్యేకమంత్రి, భాషా విధానం కావాలి అని గట్టిగా నమ్మే కాలువ వారు ఇంగ్లీషు కావాలి- తల్లిభాష చదువులూ కావాలి' అని ఉద్బోదిస్తారు. పాఠశాలవిద్యవరకైనా తెలుగు మాధ్యమం లేకపో తే, నిర్బంధం కాకపోతే తెలుగు బతుకదుగాక బతుకదు అని హెచ్చరిస్తూ... ఉచిత విద్యకు బంధనాలు ఎందుకు అని ప్రశ్నిస్తూ ఉభయ తెలుగు రాష్ట్రాల ముఖ్య మంత్రులకు బహిరంగ లేఖను సంధిస్తారు. గిడుగు రామ్మూర్తి పంతులు, కాళోజీలపై రాసిన వ్యాసాలు తెలుగుభాష పట్ల రచయిత సదవగాహనను పట్టిస్తాయి. తెలుగు భాషా ప్రేమికులందరూ చదవదగ్గ వ్యాసాలివి.

**(తెలంగాణ-భాష, చదువుల తల్లి-వ్యాససంపుటి: డా. కాలువ మల్లయ్య; వెల:రూ.100; ప్రతులకు: ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు)**

-రమణ వెలమకన్ని

# మేలైన తొలి ప్రయత్నం..



తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని గురించి తనలో కలిగిన భావాలను కవితల్లో పొందుపరిచి 'శ్రావణ మేఘాలు' పేరిట పాఠకుల ముందుంచారు కవి రంగు గోవర్ధన్. తొలి కవిత 'సంకల్పం' కవి ఆలోచనల్లోని ఉన్నతికి ప్రతీకగా నిలిచింది. మన సంకల్పం / మాన వాళికి మార్గదర్శి కావాలి...మన సంకల్పం/ అభ్యుద యానికి ఆసరగా నిలవాలి; మన సంకల్పం/ అభాగ్యులకు అండగా నిలవాలి ..మన సంకల్పం/ విశ్వ మానవ కళ్యాణాన్ని వీక్షించాలి... అంటారు. 'మరో స్నేహం' మరో మంచికవిత. ప్రకృతిలోని ప్రాణులు .. తదితరాలు మనకెంతో నేర్పుతాయంటారిందులో .పువ్వుతో స్నేహం చేయి/ నవ్వుతూ బతకటాన్ని నేర్పిస్తుంది; గాలితో స్నేహం చేయి/ సమానత్వాన్ని నేర్పిస్తుంది.. అంటూ చివరగా పుస్తకంతో స్నేహం చేయి/ సమస్తం నేర్పిస్తుంది' అంటారు. మహిళల పట్ల సహానుభూతి తో రాసిన కవితలు కొన్ని ఉన్నాయిందులో. బ్రతుకు బదిలీ' కవితలో ..తాళికట్టిన వేళ దించిన తల మళ్లీ ఎత్తలే వేమో!/ అత్తవారింట అడు గిడిన వేళ/ నర్తించిన నీ పాదాలు నడకకే పరి మితమేమో..నాన్న అధీ నంలోంచి మగని ఆధ్వర్యంలోనికి/ బ్రతుకు బదిలీ అవుతుంది.. అం టారు. ఒక చిన్నమాట'కవితలో భార్య.. ఒక చిన్నమాటండి/ ఆడ వాళ్లని అలా/ వర్ణించారేకానీ/ మీరెలా ఉండాలో/ మీకెవరూ చెప్ప లేదా!' అంటుంది. ఇలా ఎన్నో మంచి కవితలు.

**(శ్రావణమేఘాలు-కవిత్వం:రంగు గోవర్ధన్;వెల:రూ. 100; ప్రతులకు: కవి, ఇంటినెం.7-1-680, మంకమ్మతోట, కరీంనగర్, తెలంగాణ)**

-జె.శ్యామల

# అచల ప్రబోధాలు, నేటికీ మార్గదర్శకాలు



భారతదేశం పుణ్యభూమి. ఎందరో మహానుభావులు ఈ గడ్డమీద జన్మించి, తాము సంపాదించిన ఆధ్యా త్మిక సంపదను తమను శరణాగతి వేడిన వారికి పంచినారు. అనుమనగిరి జగద్గురు శివరామబ్రహ్మా యోగీంద్రులవారు క్రీ.శ.1845లో నెల్లూరు జిల్లాలోని అనుమనగిరిలో జన్మించారు. బాల్యంనుండే వీరికి ఆధ్యాత్మికవాసనలు అబ్బినవి. శివరామయ్య, సుబ్బమ్మ దంపతులకు క్రీ.శ.1874లో ఒక బాలిక జన్మించినది. ఆమె పుట్టినప్పటినుండీ తండ్రిగారి ఆధ్యాత్మికపు ఆలోచనలను ఒంటపట్టించుకున్నది. పుట్టిననాటినుండే ఎన్నో మహిమలు కనబర్చుతూ తన భక్తుల నుద్ధరించుతూ పేరుగాంచినది. ఎన్నో ఆధ్యాత్మిక విషయాలను ప్రాపంచిక విషయాలతో జోడిస్తూ, భక్తులను ఆకట్టుకున్నది. వేదాలు, ఉపనిషత్తులలోని సారాన్ని తన ప్రవచనముల్లో వివరించుతూ మోర్జం పాడు అనే గ్రామం శివారులో 1944లో మహాసమాధిచెందింది. అట్టి మహానుభావురాలి జీవితం, బోధనల వివరాలను విద్వన్మూర్తి డా. కపిలవాయి లింగమూర్తి 'మాతృశ్రీ కడియంపాటి గురుగోవిందమాంబ గారి జీవిత చరిత్ర' పుస్తకం ద్వారా పాఠకులకు అందించారు. వీరు ఎంతటి క్లిష్టతర విషయాలనైనా తమదగు శైలిలో పండితపామర రంజకంగా చెప్పగల దిట్ట. గురుగోవిందమాంబ ప్రవచనాలను తెలియజేసే ఈపుస్తకం ఆధ్యాత్మికాభిలాషులు తప్పక చదవతగ్గది.

**(మాతృశ్రీ కడియంపాటి గురుగోవిందమాంబ గారి జీవిత చరిత్ర:డా. కపిలవాయి లింగమూర్తి; వెల:రూ.100; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు)**

-కూర చిదంబరం

# ఇవీ అందాయి



బువ్వకుండ -దీర్ఘకవిత
అన్నం దేవేందర్
వెల:రూ.50
ప్రతులకు:అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు



నల్లగొండ నానీలు
(తెలుగుమూలం:పున్న అంజయ్య)
ఆడ.పి.రమేష్ నారాయణ (ఆంగ్లానువాదం)
వెల:రూ.50; ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్, నవచేతన బుక్ హౌస్, హైదరాబాద్.



నాలో నీలో గజల్ శ్రీనివాస్
డాక్టర్ ఎస్.ఆర్.ఎస్.కొల్లూరి
వెల:రూ.60
ప్రతులకు: ప్రధాన పుస్తక కేంద్రాలు



తెలంగాణ తల్లి (కవితా సంకలనం)
పున్నమి
వెల:రూ.50
ప్రతులకు:విశాలాంధ్ర, ప్రజాశక్తి బ్రాంచీలు




# కలవని దిక్కులు

కస్తూరి మురళీకృష్ణ

**చల్లగాలి వీస్తోంది**

**కిటికీలోంచి మంచుపై ప్రతిఫలిస్తున్న వెన్నెలను చూస్తున్న స్కాది మనస్సు ఆనందంతో నృత్యం చేస్తోంది.**

**'ఎంత అందమైనదీ ప్రకృతి' అనుకుంది.**

**చలికి వణుకుతూ ముడుచుకుని పడుకున్న భర్త జోర్డ్ వైపు చూసింది.**

**ఆమె మనసులో నిరసన జ్వాలలా ఎగసింది.**

**'బయట ఎంత అద్భుతంగా ఉందో తెలుసా; ఓసారి ఇటురా..చూడు' అంది.**

జోర్డ్ ఆమె వైపు చూశాడు, దుప్పట్లను మరింత దగ్గరగా లాక్కుంటూ.

అన్ని దుప్పట్లు చుట్టుకున్నా అతడు వణకుతూనే ఉన్నాడు.

అతడి పరిస్థితి చూసి ఆమె నవ్వింది. అతడికి దగ్గరగా వచ్చింది.

'అంత చలివేస్తోందా?' అడిగింది.

అతడేదో అనబోయాడు. కానీ చలికి పటపటలాడుతున్న పళ్లు, గడగడ వణకుతున్న శరీరంతో అతడి పెదవులు విడివడలేదు. గొంతులోని శబ్దం గొంతులోనే అణగిపోయింది.

'నువ్వలా ముడుచుకుని కూర్చుంటే లాభంలేదు. ఎప్పటికీ ఈ వాతావరణం నీకు అలవాటుకాదు. లే..దుప్పట్లు పారేయ్. బయట అడుగుపెట్టు' అంది.

జోర్డ్ వణుకు ఎక్కువయింది. బయట మంచులోకి అడుగుపెట్టాలన్న ఆలోచన అతడి చలిని పెంచుతోంది.

కదలని అతడిని నిరసనగా చూసింది.

'నువ్వేం దేవతవి? నువ్వేం వీరుడివి?' అంటూ, అతడి దుప్పట్లను లాగి పారేసింది.

అతడి చేయి పట్టుకుని బలవంతాన లాగింది.

తలుపు తెరచి బయటకు తోసింది. నవ్వుతూ అతడి వెనకే నడిచింది. కానీ బయట చలిలో నిలవలేక, చలికి తాళలేక గడగడ వణకుతున్న అతడిని చూసిన ఆమె పెదవులపై నవ్వు చలికి గడ్డకట్టినట్టు గడ్డకట్టిపోయింది.

స్థాణువై మంచుతో కప్పబడిపోతున్న అతడిని లోపలకు లాగింది.

************

క్షణక్షణానికి పెరిగిపోతున్న అతడి ఉత్సాహాన్ని చూస్తుంటే ఆమెలో నిరసన సముద్రంలో అలల్లా ఎగసిపడుతోంది.

'ఎదురుగా చూడు, అనంతమైన నీరు ఆకాశాన్ని తాకుతున్నట్టు లేదు. నీరు ఆకాశం కలసిపోయినట్టు లేదూ...'ఎంతో ఉత్సాహంగా దిగంతంవైపు చూపుతూ అన్నాడు జోర్డ్.

అతడి కళ్లల్లో మెరుపును, ఆనందాన్ని చూస్తూ సంతోషించలేకపోతోంది స్కాది.

ఆమె ఒళ్లంతా చెమటలు జారిపోతున్నాయి. సముద్రం నుంచీ వీచే గాలికూడా ఆమె శరీరాన్ని చల్లబరచలేకపోతోంది.

కెరటాలపై ప్రతిఫలిస్తున్న ప్రతి సూర్యకిరణం ఒక నిప్పుకణిక అయి ఆమె శరీరాన్ని దహిస్తున్నట్టు అనిపిస్తోంది ఆమెకు.

జోర్డ్ ఆనందం పంచులోలేకపోతోంది. ఆనందాన్ని అనుభవించలేకపోతోంది. అక్కడ నిలవలేకపోతోంది.

'ఇంట్లోకి వెళ్లిపోదాం' పంటి బిగువున అంది.

ఇంట్లో కూడా ఉండటం ఆమెకు కష్టంగా ఉంది.

ఆమె కష్టాన్ని గ్రహించిన జోర్డ్, ఆమెకోసం ప్రత్యేకంగా గదిని కట్టించాడు. గది నిండా మంచును నింపాడు. మంచు కరగుతున్నకొద్దీ సేవకులు మళ్లీ కొత్తగా మంచును తెచ్చి గదిలో పెడుతున్నారు.

గది కిటికీలకు తడి గుడ్డలు కట్టారు. ఆరారగా గుడ్డలను తడుపుతూ ఉన్నారు. వీచేగాలిలోని తేమను గ్రహించి ఆ గదిని మరింత చల్లగా చేసే ప్రయత్నాలు చేస్తున్నారు.

ఇతరులు ఆ గదిలోని చలికి వణికిపోతున్నా, స్కాది మాత్రం చెమటతో తడిసి ముద్ద అయిపోతోంది.

'జ్యోటున్యామ్ వెళ్లిపోదాం' పంటి బిగువున అంది. జోటున్యామ్ ఆమె పుట్టినిల్లు. ఆకాశాన్ని తాకే మంచు కొండల నడుమ ఉంటుందామె ఇల్లు.

'ఇక్కడ బాగాలేదా?' అడిగాడు జోర్డ్.

తల అడ్డంగా ఊపింది స్కాది.

'ఇక్కడే ఉంటే వారంరోజులలోపలే నేను చచ్చిపోవటం ఖాయం' అంది.

'కానీ మీ మంచుకొండల నడుమ నేను జీవించలేను'. ఆమె ఇంట్లో తన అనుభవాన్ని తలచుకుని చెప్పాడు జోర్డ్.

'నేను ఇక్కడ ఉండలేను' కచ్చితంగా చెప్పింది స్కాది.

ఇద్దరూ ఒకరివైపు ఒకరు చూసుకున్నారు. వారి కళ్లల్లో ప్రేమ లేదు. ద్వేషం లేదు. ఒకరిపై ఒకరికి జాలి ఉంది.

తమనీ పరిస్థితుల్లోకి నెట్టిన విధిపై నిరసన ఉంది.

************

వారిద్దరి వాదనలు విన్నారు దేవతలు.

'నా తండ్రి ఓడిన్ దేవత దగ్గర ఉన్న జీవదానం చేసే ఏపిల్‌ను దొంగిలించాడు. దాన్ని సాధించటం కోసం దేవతలు నా తండ్రిని సంహరించారు. అది తెలుసుకున్న నేను కోపంతో దేవతలపై దాడిచేశాను. నా దాడిని తట్టుకోలేక దేవతలు వాళ్ల దేశానికి వచ్చారు. రాజీపడ్డారు. నాకు వచ్చిన దేవతను నేను వివాహం చేసుకోవచ్చన్నారు. కానీ ఇక్కడే దేవతలు నన్ను మోసంచేశారు' అందరివైపు కోపంగా చూస్తూ అంది స్కాది.

దేవతలు ఒకరివైపొకరు చూసుకున్నారు. కళ్లు దించుకున్నారు.

'నేను నాకు నచ్చిన దేవతను ఎంచుకోవచ్చన్నారు. వివాహం

చేసుకోవచ్చాన్నారు. కానీ దేవత ముఖం చూడకూడదన్నారు. కాళ్లు చూసి నాకు నచ్చిన దేవతను ఎంచుకోమన్నారు. నేను తెల్లగా, స్వచ్ఛంగా ఉన్న కాళ్లను చూసి అందమైన దేవత 'బాల్డర్' కాళ్లనుకున్నాను. ఇష్టంగా ఎంచుకున్నాను. కానీ అవి సముద్ర దేవత జోర్డ్ కాళ్లు'.

'అంటే..అంటే...నువ్వు నన్ను మనస్ఫూర్తిగా ఇష్టపడలేదా?' ఆశ్చర్యంగా అడిగాడు జోర్డ్.

'నేనే ఎన్నుకున్నాను కాబట్టి నేను రాజీపడ్డాను. ఇతడితోటే జీవితం గడుపుదామని నిర్ణయించుకున్నాను. కానీ నేను పుట్టి పెరిగింది మంచుకొండల నడుమ. మా దగ్గర మంచు కరగదు. సూర్య కిరణాల వేడి వెన్నెల వెలుగులా చల్లగా ఉంటుంది. కానీ జోర్డ్ ఇల్లు సముద్రం నడుమ. అక్కడ వెన్నెల వెలుగు కూడా చెమటలు పట్టిస్తుంది. నేను జోర్డ్ ఇంట్లో ఉండలేను. నేను జోర్డ్‌తో కలసి ఉండాలంటే జోర్డ్ మా ఇంటికి రావాల్సిందే. అక్కడయితేనే మేం కలసి ఉండగలం. కాబట్టి జోర్డ్‌ను మా మంచుకొండల నడుమ ఉండేట్టు ఒప్పించండి' తాను చెప్పాల్సింది చెప్పింది స్కాది.

దేవతలు జోర్డ్ వైపు చూశారు.

అప్పటికే జోర్డ్ కళ్లు ఎర్రబడ్డాయి. అతడి ముఖంపై కోపం కనిపిస్తోంది.

'స్కాది చెప్పింది నిజం. ఆమె సముద్రం నడుమ ఉండలేదు. ఆమె ఎలాగ సముద్రం నడుమ ఉండలేదో, అలాగే నేను మంచుకొండల ప్రాంతంలో ఉండలేను. ఆ చలిని నేను భరించలేను. నాతో కలిసి ఉండాలంటే స్కాది సముద్రంలోకి వచ్చి ఉండాల్సిందే. ఆ మంచుకొండల నడుమ నేను వారంలోగా మరణించటం తథ్యం' నిష్కర్షగా చెప్పాడు జోర్డ్.



'వివాహబంధం అతి పవిత్రమైంది. కలసి ఉండటం మీ సామాజిక బాధ్యత. అన్నీ అనుకూలంగా ఉన్నప్పుడు ఎవరైనా ఆనందంగానే ఉంటారు. అది గొప్పకాదు. ప్రతికూల పరిస్థితులను అనుకూలంగా మార్చుకుని కలసి ఉండటం గొప్ప. మనిషిలోని స్నేహ భావానికి, సహనానికి, ఔన్నత్యానికి నిదర్శనం. మీ ప్రేమ బంధంలోని ఉత్తమత్వాన్ని నిరూపిస్తుంది' అన్నారు దేవతలు.

'ప్రేమబంధం' అనగానే స్కాం, జోర్డ్‌లు ఒకరిపై ఒకరు చూసుకున్నారు.

స్కాది నోరువిప్పింది. 'మా మధ్య ప్రేమలేదు. నేను బాల్డర్ గురించి విన్నాను. అతడి అందం గురించి ఆశపడ్డాను. కానీ విధి వశాత్తు పొరపాటున జోర్డ్‌ను ఎంచుకున్నాను. కాబట్టి ఇతడినే ప్రేమించాలని ప్రయత్నించాను. ఇతడిని ఇష్టపడాలని ప్రయత్నించాను. కానీ నాకు ఆ అవకాశం ఇవ్వలేదు జోర్డ్. మంచుకొండల నడుమ అతడు వణుకుతూ కూర్చున్నాడు. సముద్రంలో నేను చెమటలు కక్కుతూ చచ్చాను. మా మధ్య పెళ్లితో బంధం ఉంది తప్ప, ప్రేమ బాంధవ్యం లేదు' నిర్మొహమాటంగా చెప్పింది స్కాది.

తిరస్కారంగా మెవైపు చూశాడు జోర్డ్.

'నేను ఇన్నాళ్లు స్కాది నన్ను ఇష్టపడి వివాహమాడిందనుకున్నాను. నా కాళ్లను చూసి బాల్డర్ అనుకుని పొరపాటు పడిందని ఇప్పుడే తెలిసింది. ఆమెను ప్రేమించాలన్న భావన ఏ మూలో ఉన్నా ఇప్పుడది ఆవిరైపోయింది. ఆమెతో కలిసి ఉండేందుకు ప్రయత్నించాలన్న పట్టుదల అదృశ్యం అయిపోయింది. నేను మంచుకొండలలో ఉండలేను. అదీగాక ఇష్టంలేని వారితో కలసి ఉంటూ, ప్రేమిస్తున్నట్టు నటించలేను. స్కాది కోపం తగ్గించి, ఆమెతో రాజీపడేందుకు దేవతల రక్షణకోసం ఆమెతో పెళ్లికి సిద్ధపడ్డాను. కానీ జీవితాంతం నన్ను ఇష్టపడని ఆమెతో, కలసి జీవించే నటనను నేను నటించలేను' నిర్మొహమాటంగా చెప్పాడు జోర్డ్.

ఇద్దరి వాదనలు విన్న దేవతలు ఇరకాటంలో పడ్డారు. వారికి స్కాది కోపం తెలుసు. ఆమెకు కోపం వస్తే దేవతలను క్షణంలో నాశనం చేయగలదని తెలుసు. అందుకని తీర్పు ఎవరి పక్షాన చెప్పాలో తెలియటంలేదు వారికి. పైగా వివాహబంధం ఏర్పడిన తరువాత దాన్ని తెగగొట్టటం వారికి ఇష్టంలేదు. వివాహం దైవ నిర్ణయం. వివాహాన్ని విడగొట్టటం దైవ నిర్ణయాన్ని భగ్నం చేసినట్టవుతుంది.

అందుకే ఏంచేయాలో వారికి తోచటంలేదు.

'మీరిద్దరూ తెలివైనవారు. పరిణత మనస్కులు. ఈ సమస్యకు పరిష్కారాన్ని మీరే సూచించండి. కానీ అందువల్ల ద్వేషాలు రగల కూడదు. యుద్ధానికి సిద్ధంకాకూడదు' అన్నారు దేవతలు.

వాళ్లమాటలు విని పెద్దగా నవ్వింది స్కాది.

'నేను మీతో యుద్ధం చేయటం జరగదు. ఎందుకంటే జోర్డాను ఎంచుకున్నది నేనే. నా తప్పుకు మీరు బాధ్యులు కారు. మేము కలిసి జీవించటం కుదరని పని కాబట్టి నన్నీ బంధం నుంచి విముక్తను చేయండి. నా ఇష్టం వచ్చినట్టు నేను బతుకుతాను. జోర్డా ఇష్టం వచ్చినట్టు జోర్డా బతుకుతాడు. ఎవరి స్వేచ్ఛ వారిదే' అంది స్కాది.

జోర్డా కూడా అంగీకారం తెలిపాడు.

దేవతలు తర్జనభర్జనలు చేసుకున్నారు. 'మనం దేవతలం. మన ప్రవర్తన మనుషులకు ఆదర్శం కావాలి. మనమే వివాహ బంధాన్ని విడగొడితే, మనుషులు దాన్ని అనుసరిస్తారు. మానవ సమాజాలు అల్లకల్లోలమవుతాయి, వివాహమనే వ్యవస్థ కూలిపోతే . మరోసారి ఆలోచించండి' అన్నారు దేవతలు.

వారి మాటలకు ఒప్పుకోనట్టు తల అడ్డంగా తిప్పింది స్కాది.

'వివాహబంధం నిలవాలంటే రాజీ అవసరం. సహనం అవసరం ఒకరిపట్ల ఒకరికి గౌరవం, స్నేహం, ప్రేమ భావనలు అవసరం. ముఖ్యంగా వివాహం సామాజిక బాధ్యత అని, భావితరాలపై తమ ప్రతిచర్య ప్రభావం చూపుతుందనే అవగాహన అవసరం. అవి లేనప్పుడు బలవంతంగా వివాహ బంధంలో ఉండటం ఆనందం కన్నా అనర్థానికి దారితీస్తుంది. కాబట్టి మాలాంటి వారు ఎవరి బతుకులు వారు బతకటమే మేలు. మమ్మల్ని మనుషులు అనుసరించినా, మానవుల మనస్సుల్లోని ప్రేమ భావనలు, బాధ్యతలు, కర్తవ్య భావనలు అంతరించనంతకాలం వివాహ వ్యవస్థ సజీవంగానే ఉంటుంది. తనని తాను అధికంగా ప్రేమించేవారు వివాహ వ్యవస్థలో ఒదిగి ఉండలేరు' అన్నాడు జోర్డా, స్కాదివైపు చూస్తూ.

అతని మాటలలో దాగున్న సత్యాన్ని గ్రహించారు దేవతలు. వారిద్దరూ విడిపోయి వేర్వేరుగా బతకటానికి అనుమతినిచ్చారు.

వెంటనే తమ మంచుకొండలకు వెళ్లిపోయింది స్కాది. తన సముద్రానికి తరలివెళ్లాడు జోర్డా.

అందుకే సముద్రం, మంచు కలవవని, మంచుకూ సముద్రం నీటికీ పడదని స్కాండినేవియా పౌరాణిక కథలు చెప్తాయి. సముద్రంలో కరగని మంచువల్ల మానవాళికి ప్రమాదమనీ హెచ్చరిస్తాయి. ఈ హెచ్చరికలో స్కాది, జోర్డాలను అనుసరించటం ప్రమాదమన్న సూచన ప్రతీకాత్మకంగా ఉంటుంది. ■

# దారి చూపుతారా

పిల్లలూ! బాబీకి యాపిల్‌ను చేరే దారి చూపుతారా!



# తేడాలు గుర్తిస్తారా



బాలలూ! ఈరెండు బొమ్మలు చూడగానే ఒకేలా కనిపించినా, జాగ్రత్తగా గమనిస్తే వాటి మధ్య 5 తేడాలున్నాయి. వాటిని మీరు గుర్తించాలి.

# సాయంలోనే సంతోషం

ఒక ఊళ్లో శేఖర్ అనే అబ్బాయి ఉండేవాడు. అందరు పిల్లల మాదిరిగానే శేఖర్ కూడా అన్ని పండగల కంటే దీపావళి అంటే చాలా ఇష్టపడే వాడు. ఆ వీధిలో ఉన్న అందరికంటే ఎక్కువ డబ్బులు ఖర్చుపెట్టి దీపావళికి బాణా సంచా కొనుక్కునే వాడు. దీపావళి ముందురోజున మొదలుపెట్టి, దీపావళి తర్వాత రోజు కూడా బాణాసంచా కాల్చేవాడు. తల్లి 'ప్రతిసారీ ఇంత డబ్బు ఖర్చు పెట్టి ఇన్ని రకాలు కొనడం అవసరమా? అని తిడుతూ ఉండేది. ఈ డబ్బులో కొంతైనా పేదవాళ్లకి ఇస్తే వాళ్లు సంతోషిస్తారు' అనేది. కానీ శేఖర్ ఉత్సాహాన్ని చూసి తండ్రి ఏమీ అనలేక పోయేవాడు. ఇద్దరూ కలిసి వందల రూపాయల బాణాసంచా కొని కాల్చేవారు.

అయితే ఒసారి మాత్రం దీపావళి రోజున కొన్ని టపాకాయలే కొన్నారు. 'ఈసారి అంత తక్కువ ఎందుకు కొన్నారు?' అని తల్లి అడిగింది.

అందుకు 'షాపు దగ్గరకు వెళ్లే దారిలో నాకు ఇద్దరు చిన్న పిల్లలు కనిపించారు. వారు చిరిగి మాసిపోయిన దుస్తుల్లో ఉన్నారు. వారిని చూస్తే జాలేసింది. దీపావళికిఖర్చుపెట్టే డబ్బులోంచి కొంత డబ్బుతో వాళ్లకి దుస్తులు కొనిస్తే బాగుంటుందికదా అనిపించింది. అందుకే వెంటనే కొత్త దుస్తులు కొని వారికి ఇచ్చాను. అంతే కాదు, నేను కొనుక్కొన్న బాణాసంచాలో కొన్నింటిని వారికిచ్చాను. పాపం వాళ్లెంతో సంతోషించారు. నాకు కృతజ్ఞతలు తెలిపారు' చెప్పాడు శేఖర్.



కథ

తల్లి శేఖర్ చేసిన మంచిపనికి ఎంతో ఆనందించింది.

అప్పటినుంచి శేఖర్ దీపావళికి బాణాసంచాకు చేసే ఖర్చు తగ్గించుకోసాగాడు. బాణాసంచా కాల్చడంలో పొందే ఆనందం కన్నా ఇతరులకు సహాయం చేయడంలో చాలా ఆనందం ఉందని గ్రహించాడు. అప్పటి నుంచి ఉన్నంతలో పేదలకు సహాయం చేయటం అలవాటు చేసుకున్నాడు.

శేఖర్‌లో వచ్చిన మార్పు వాళ్ల అమ్మానాన్నలకి ఎంతోసంతోషం కలిగించింది.

**-ఉలాపు బాలకేశవులు**
**గిద్దలూరు.**

## మీకు తెలుసా?

* కుందేళ్లు, చిలకలు తమ తలలు వెనక్కు తిప్పకుండానే వెనక ఏమున్నదీ చూడగలవు.
* ఎన్నాళ్లయినా చెడని పదార్థం ఏదైనా ఉన్నదీ అంటే అది, తేనె.
* యాపిల్ పండు నీటిపై తేలుతుందని ఎప్పుడైనా గమనించారా? కారణం యాపిల్‌లో 25శాతం గాలి ఉండటమే.
* అగ్నిపర్వతాల్లేని ఏకైక ఖండం ఆస్ట్రేలియా.
* మనిషి కన్ను పదిమిలియన్లకు పైగా రంగుల్ని గుర్తించే శక్తి కలిగి ఉంటుంది.
* 'సైంటిస్ట్' అనే పదం 1833లో వాడకంలోకి వచ్చింది.










# హితవు

## బాలగేయం

గొప్పలు చెప్పకు తప్పు
తప్పులాడకు ముప్పు
చక్కగా మసిలితే
వాడని పూలగుత్తివి నువ్వు!

ప్రతిమాట అర్థాలు
గ్రహించుటే తెలివి
తెల్లకాగితంపై గని
చెరగని తరగని అక్షరానివి నువ్వు!

ఆటపాటలందున
మేటిబలం చూపు
అన్నింటా గెలుచు
తెలివితేటలు పెంచు
అమ్మానాన్న ఆశ నువ్వు!

మిత్రులందరి తోడి
కలిసి మసలి మంచి
పెంచిన ప్రతినిధివవ్వు
చెడులో మేలు లేదన్న
గుర్తెరిగి మెలిగితే
వెన్నెలల లయల
పున్నమిచంద్రుడు నువ్వు!

గుర్తుంచుకో రేపటి భవితకు
నేటి వెలుగువు నువ్వు!!

–యల్ రాజాగణేష్
విశాఖపట్నం.

**తేడాలు గుర్తిస్తారా జవాబు**

1. విమానం పైని చిన్ని సున్నాల డిజైన్‌లో ఒకటి తగ్గింది.
2. మబ్బుల్లో తేడా
3. విమానం చివరి భాగంలో గీతల్లేవు.
4. కొనభాగం నలుపు.
5. కళ్లలాంటి భాగంలో తెల్లచుక్కలేదు.

## హలో ఫ్రెండ్...

**చిన్నారుల ప్రశ్నలకు**

వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్

**గిరీష్ అంకుల్ సమాధానాలు**

**కె.సూర్యతేజ్, వరంగల్.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. శబ్ద కాలుష్యం అంటుంటారుకదా. అసలు మనిషి చెవులు ఏమేరకు శబ్దాలనుభరించగలవు? శబ్దకాలుష్యం వల్ల కలిగే నష్టాలేమిటి? దయచేసి వివరించండి.**

**జవాబు:** సూర్యతేజ్! ధ్వనిని డెసిబెల్స్‌లో లెక్కిస్తారు. మనిషి చెవులు 80 డెసిబెల్స్ శబ్ద తీవ్రత వరకు భరించగలుగుతాయి. శబ్ద తీవ్రత 80 డెసిబెల్స్ దాటి 130 డెసిబెల్స్‌కు చేరితే ఆ శబ్దకాలుష్యం మనిషిని తీవ్ర ఇబ్బందులకు గురిచేస్తుంది. తీవ్ర శబ్దాలు అకస్మాత్తుగా వినబడినపుడు చెవిలోని కర్ణభేరి దెబ్బతిని వినికిడి శక్తి క్షీణిస్తుంది, శబ్దకాలుష్యానికి దీర్ఘకాలం లోనైనపుడు తాత్కాలిక చెవుడు ఏర్పడుతుంది. ఒక్కోసారి తీవ్రమైన శబ్దాలు హఠాత్తుగా విన్నపుడు శాశ్వత చెవుడు ఏర్పడే అవకాశం కూడా ఉంటుంది. శబ్ద తీవ్రత 150 డెసిబెల్స్ దాటితే అకౌస్టిక్ ట్రామా అనే వ్యాధికి గురికావలసి వస్తుంది. శబ్దకాలుష్యం వలన అలసట, ఆందోళన మానసిక ఒత్తిడి, నిద్రలేమి, తలనొప్పి మొదలగు మానసిక లక్షణాలు కలుగుతాయి. నాడీ వ్యవస్థ దెబ్బతినడం, నరాల బలహీనత, కండరాలు కుంచించుకుపోవడం, అధిక రక్తపోటు, గుండెజబ్బు మొదలైన వ్యాధులకు కూడా గురికావలసి వస్తుంది. తీవ్రమైన శబ్దాల ప్రకంపనల ప్రభావాన్ని సూపర్ సోనిక్ బూమ్ అంటారు. దీని వలన పాత కట్టడాలు కూడా దెబ్బతింటాయి. పెచ్చులూడి పోవడం, పగుళ్లు ఏర్పడటం, తలుపులు, కిటికీలు, కిటికీ అద్దాలు దెబ్బ తినడం జరుగుతుంది. ఉదాహరణకు హైదరాబాద్‌లోని చార్మినార్‌ను కూడా చెప్పుకోవచ్చు. విమానాశ్రయాల దగ్గరలో ఉన్న గృహాలలో నివసించే వారిపై విమానాల శబ్దకాలుష్య ప్రభావం చాలా ఎక్కువగా ఉంటుంది. శబ్ద తీవ్రత వలన కండరాలు కుంచించుకుపోయి నాడీ వ్యవస్థ సైతం దెబ్బతింటుంది.

**కె.మాధురి, విజయవాడ.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్కారాలు. నేను ఏడో తరగతి చదువుతున్నాను. ఈ సృష్టిలో అన్నిటికన్నా పెద్ద జంతువు ఏది? దయచేసి చెప్పండి.**

**జవాబు:** మాధురి! సృష్టిలో అన్నిటికన్నా పెద్ద జంతువు 'నీలి తిమింగలం'. వీటిలో అన్నిటికన్న పెద్దది 108 అడుగుల పొడవు, 80 టన్నుల బరువు ఉంది. అప్పు డెప్పుడో కొన్ని కోట్ల సంవత్సరాలక్రితం భూమ్మీద ఉన్న డైనోసార్‌లు కూడా నీలి తిమింగలం కంటే చిన్నవే. ఎలాగంటే దొరికిన అతిపెద్ద డైనోసార్ అస్థిపంజరం పొడవు కూడా 87.5 అడుగులు మాత్రమే. బరువు 50 టన్నులని అంచనావేశారు.

# ఎన్నదగ్గ ఎకో టేబుల్‌వేర్

**ఆరోగ్యం మహాభాగ్యమని, అందుకోసం ఆరోగ్యకరమైన జీవనశైలిని, ఆహార అలవాట్లను అలవరచుకోవాలని నిత్యం ప్రతిచోట, ప్రతిక్షణం ముచ్చటిస్తూనే ఉంటారు. కానీ ఆహారం ఆరోగ్యకరంగా ఉండాలన్నంత వరకే ఆలోచిస్తున్నారు కానీ ఆహారపదార్థాలను ఉంచే, ప్యాక్ చేసే వస్తువుల గురించిన ఆలోచన కొరవడింది అంటారు రియా సింఘాల్.**

సర్వ్ చేసే పాత్రలు, తినడానికి ఉపయోగించే ప్లేట్లు, ప్యాకింగ్‌కు వాడే బాక్స్‌లు ప్లాస్టిక్‌తోనే తయారవుతున్నాయి. తద్వారా వాటిని తినే వ్యక్తుల ఆరోగ్యానికి హాని కలుగుతుంది. ఈ ఆలోచనతోనే ఆమె 'ఎకో వేర్' పేరిట పర్యావరణ హితమైన, ఆరోగ్యకరమైన విధానంలో సర్వింగ్ డిష్‌లు, ప్లేట్ల తయారీకి పూనుకున్నారు. రియా సింఘాల్ పుట్టింది ముంబైలో ఆమె ఏడాది వయసులో ఉండగానే (1983లో) వారి కుటుంబం దుబాయ్‌కి తరలి వెళ్లింది. రియా దుబాయ్‌లో, ఆ తర్వాత లండన్‌లో పెరిగింది. యుకెలో బోర్డింగ్ స్కూల్లో చదువుకున్న ఆమెకు చక్కని క్రమశిక్షణ, స్వతంత్ర భావాలు అలవడ్డాయి. బ్రిస్టల్ యూనివర్సిటీలో ఫార్మకాలజీ (ఆనర్స్) చేసిన రియా, గ్రాడ్యుయేషన్ తర్వాత లండన్‌లోని ఫైజర్ ఇంక్.లో సీనియర్ మార్కెటింగ్ అండ్ సేల్స్ ఎగ్జిక్యూటివ్‌గా ఉద్యోగంలో చేరింది. ఫైజర్‌లో ఐదేళ్ల ఉద్యోగానుభవం ఆమెకు చదివిన పాఠ్య పుస్తకాలంటే ఎక్కువే నేర్పింది. 2009లో ఆమె ఫైజర్‌లో ఉద్యోగాన్ని వీడి భర్తతో పాటు ఢిల్లీకి చేరింది. విదేశంలో పర్యావరణ హితమైన శైలి అలవాటైన ఆమెకు భారత్‌లో ప్లాస్టిక్ వినియోగం, స్టైరోఫోమ్ వినియోగం ఆలోచింపజేసింది. అంతేకాదు, తాను పనిచేసిన ఫార్మాస్యూటికల్ కంపెనీ ఫైజర్‌లో అంకాలజీ టీమ్‌లో పనిచేసి నప్పుడు క్యాన్సర్‌కు సంబంధించిన ఎన్నో రిస్క్ ఫ్యాక్టర్లను మనం అదుపుచేయవచ్చని తెలుసుకున్న విషయం గుర్తుకు వచ్చింది. వంశానుగతంగా వచ్చే లక్షణాలను అదుపు చేయలేకపోవచ్చు, గతంలో మనం చేసిన దాన్ని సరిచేయలేకపోవచ్చు కానీ మనం తీసుకునే ఆహారం ఎటువంటిది, ఎలా తినాలి అనే అంశాలు మన అధీనంలోనే ఉంటాయి. అటువంటప్పుడు ప్లాస్టిక్ పాత్రలు, ప్లేట్లు, బాక్సుల వినియోగం మానేయవచ్చుకదా. వేడిగా ఉన్న ఆహారపదార్థాలను సన్నగా ఉండే ప్లాస్టిక్ ప్లేటులో ఉంచినపుడు ఆ వేడికి ఆ ప్లేటుకు చెందిన రసాయనిక



ద్రవాలు కరిగి ఆహారపదార్థాలలో చేరతాయి. వాటివల్ల ఆరోగ్యానికి ఎంత ముప్పు! ఆ ఆలోచన వచ్చిన క్షణంలోనే తానే ఎకో వేర్ తయారీకి పూనుకుంటే అనుకుంది. తనకు అందుకు తగ్గ తెలివి, నేర్పు ఉన్నాయని తెలుసు. అయితే సరైన అవకాశం కోసమే



ఆగింది. ఎకోవేర్ ఆలోచన రావడంతో వెంటనే రంగంలోకి దిగింది. తాను తయారు చేసే వస్తువులు వాడి పారేసినా, అవి నేలలో త్వరగా కలిసిపోయేవిగా ఉండాలన్నది ఆమె భావన. ఎంతో పరిశోధన అనంతరం ప్లాంట్ బయోమాస్‌తో ఎకోవేర్ తయారీ చేయాలని నిర్ణయించు కుంది. బయోమాస్ అంటే.. చేలల్లో పంట కోత అనంతరం అది వరి, గోధుమ, చెరకు వంటివేవైనా మిగిలిన వ్యర్థం.. దాన్ని గుజ్జుగా చేసి ఓ ట్యాంక్‌లో చేర్చి, యంత్ర సహాయంతో దాన్ని అచ్చుల్లో పోసి, వేడి చేసి, ఆరబెడతారు. దీంట్లో ఇక ఎటువంటి వృధా ఉండదు. పూర్తి పర్యావరణ హితమైం దని యు.ఎస్. డిపార్ట్‌మెంట్ ఆఫ్ అగ్రికల్చర్ సర్టిఫై చేసింది కూడా. టేబుల్ వేర్ ఐటమ్స్ అన్నీ మైక్రోవేవ్‌లో, ఫ్రిజ్‌లో ఉంచడానికి అనుకూలమైనవి. వీటిలో ద్రవపదార్థాలను పోసి ఉంచితే ఇరవై నాలుగ్గంటల పాటు ఎటువంటి లీక్ లేకుండా ఉంటాయి. వీటి తయారీలో ఇతరత్రా బైండర్స్, ఎడిటివ్స్, కోటింగ్స్, ఫిల్లర్స్, ప్లాస్టిక్ లేదా వాక్స్ లైనింగ్‌లు లేదా క్రిమిసంహారక లేదా రసాయన అవశేషాలు ఉండవు.

ఎకోవేర్ ఉత్పత్తుల ధరలు ప్లాస్టిక్‌వాటి కంటే 15శాతం హెచ్చుగా, స్టైరో ఫోమ్ ఉత్పత్తుల ధరలకంటే 35 శాతం హెచ్చు గాను ఉంటుంది. ఎకోవేర్ యాప్ సాయంతో వీటిని ఖరీదుచేయవచ్చు. అమెజాన్, స్నాప్‌డీల్ ద్వారా, ఇతర డిస్ట్రిబ్యూటర్ల ద్వారా కూడా దేశమంతటా అందుబాటులో ఉంచా రు. రియా ఎకోవేర్‌కు వ్యక్తులే కాదు, హల్దీరామ్స్, చాయోస్, చాయ్‌పాయింట్ తదితరులు కూడా వినియోగదారులుగా ఉన్నారు. ఢిల్లీ , ముంబై విమానాశ్ర యాలలో, అమెరికన్ ఎంబసీ స్కూల్లో, ఒబెరాయ్ హోటళ్ల మొదలైన వారి నుండికూడా రియాకు ఆర్డర్లు ఉన్నాయి.

2009లో మొట్టమొదట తానొక్కతే పనిమొదలుపెట్టినా ఆ తర్వాత ఆమె భర్తకూడా తన ఉద్యోగాన్ని వీడి ఎకోవేర్ ఇండస్ట్రీలో పనిచేయడానికి చేయికలిపాడు. ఆయన కంపెనీ సిఇఒగా వ్యవహరిస్తుండగా, ఆమె వ్యాపారాభివృద్ధి అమ్మకాలు, మార్కెటింగ్ తదితర వ్యవహారాలు చూస్తున్నారు. 'మేమిద్దరం ఎవరి పనులు వాళ్లం చూసుకుంటాం. ఒకరి పనిలో మరొకరు జోక్యం చేసుకో వటం ఉండదు. అలాగే ఆఫీసుగురించి ఆఫీసు పనిగంటల్లోనే చర్చించుకుంటాం. ఇంట్లో మా పూర్తి సమయాన్ని మా పిల్లలకు కేటాయిస్తాం.

రియా తలపెట్టిన ఎకోవేర్ ఉత్పత్తి 2010 నుంచి మొదలైంది. ప్రస్తుతం రెండు యూనిట్లతో, 100మంది ఉద్యోగులతో, సాలీనా పదికోట్ల టర్నోవర్‌తో చక్కగా సాగుతోంది రియా ఇండస్ట్రీ. భారత్‌లోనే కాదు, యు.ఎ.ఇ., ఆస్ట్రేలియా, కెనడాలలో కూడా వ్యాపించింది. ముున్ముందు టేక్ అవే ప్యాకేజింగ్ సొల్యూషన్లు, ఇండస్ట్రియల్ ప్యాకేజింగ్ మెటీరియల్, హాస్పిటల్ డిస్పోజబుల్స్‌కు ప్యాకేజింగ్ కూడా తయారుచేయాలన్నది రియా ఆకాంక్ష.

-శ్రీహాస

# నిజమైన కవిత్వానికి నిచ్చెన అక్కర్లేదు...!!

**అందరూ అనునుగానీ- కొందరు మాత్రం మనసునిండా కవితాశక్తి కమ్ముకుంటే, ఒద్దికగా కూర్చోలేరు. ఒక్కచోట నిలబళ్లేరు. అక్షరాలలో అనుసంధానమైపోవాలని తపించిపో తుంటారు తీవ్రమైన ఆలోచనలను బయటపెట్టడానికే కాదు, ప్రేమబంధాలను తీయగా ఆవిష్కరించేందుకు అక్షరాలను అనుక్షణం వినియోగించు కుంటుంటారు.**

ఏకవి అయినా మొదట్లో ఉత్సాహంతో తన ప్రస్థానాన్ని ప్రారంభిస్తాడు. ఒకటి, రెండు రచనలు పత్రికల్లో అచ్చవగానే, ఉబలాటంలో ముందుకు సాగుతాడు.

ఇప్పుడు కవికి సహజ పరమైన చైతన్యం ఎక్కువగా గోచరిస్తుంది. సహజగతమైన వస్తువునే తన కవితా వస్తువుగా కవులు ఎంచుకుంటున్నారు. సమకాలీన ప్రపంచపు రుగ్మతలపై అక్షరాయుధాన్ని ఎక్కుపెట్టి కవితాయానం సాగిస్తున్నారు.

వచనాన్ని కవిత్వంలా మలచడానికి, కావలసిన కవిత్వభాషకోసం, మెళుకువలకోసం నిరంతరం అధ్యయనం, సాధన ఎంతో అవసరం. కవిత్వం వచనంలా తేలిపోతే పాఠకులకు రసానుభూతి కలిగించదు.

అక్షరం నుండి పదందాకా, పదం నుండి వాక్యం దాకా, వాక్యం నుండి పంకులదాకా, వాక్యం నుండి పంక్తులదాకా ప్రయాణం చేసే లోతైన సముద్రం వంటిది సాహిత్యం. ఏ సాహిత్యరూపం తీసుకున్నా అది సమర్ధవంతమైన కవి చేతిలో మేలిమి బంగారం అయిపోయి మొందటిశ్రేణిలో కూర్చుంటుంది.

సాహిత్యం సామాజిక అవసరాలనుంచే పుడుతుంది. సమాజంలో అంగబలంతోనో, ఆర్థికబలంతోనో, పెత్తనంచేసే దోపిడివర్గాల అవసరాలు తీర్చడానికి సాహిత్యం ఉపయోగపడకూడదు. సాహిత్యానికి హంగు, ఆర్భాటం కంటే ఆలోచనాత్మకమైన, అర్ధ సంయుతమైన అధ్యయనం, అవగాహన, విశ్లేషణతో కూడిన అంకితభావం అత్యవసరం.

కవిత్వానికి వ్యక్తీకరణ ప్రధానం ఎంత అందంగా చెబితే, అంతబాగా పాఠకుల్ని ఆకట్టుకుంటుంది. సమాజంలోని విభిన్నాంశాలకు స్పందిస్తూ, హృదయగతమైన అనుభూతుల్ని సైతం ఆర్ద్రమైన రీతిలో, ప్రకృతినుంచి సముచితమైన ప్రతీకల్ని ఎంచుకుంటూ, సరమైనరీతిలో వ్యక్తమవ్వాలి.

పదాలు ఎక్కువైతే భావం పలచబారిపోయి కవిత్వం హృదయంలో యింకదని, కవిత్వం యౌవన దీప్తితో వసంతకాలంలో చెట్లవలె ఉండాలనీ గుర్తించాలి. అలంకారికత జ్ఞాపకం పెట్టుకునే లక్షణాలు కూడా ఉంటే మంచిది.

ప్రజలకు భారంగా మారిన వివిధ జీవన సమస్యల్ని వస్తువులుగా తీసుకొని, విభిన్న కోణాల్లో కవులు కవిత్వీకరిస్తున్నారు. తాము రాసిన కవితల్ని ఉద్వేగంగా గొంతెత్తి వినిపిస్తున్నారు. తమ కవితా పఠనంతో సాహిత్యాభిమానుల్ని అలరిస్తున్నారు. అస్తవ్యస్త విధానాలతో ప్రజా జీవితంపై పెనుభారాన్ని మోపుతున్న పాలకులపై అక్షరనిప్పుల్ని వెదజల్లుతున్నారు.

నిజమైన ఏకవీ తానో గొప్ప కవిత్వం రాస్తున్నానని రాయడం మొదలెట్టడు. అప్పటికి తన హృదయాన్ని స్పృశించిన ఓ అంశాన్ని పాఠకులతో పంచుకోడానికి రాస్తాడు. తన శక్తిమేరకు రాస్తాడు. అది గొప్ప కవితా, కాదా అన్నది దాన్లో ఉన్న విలువలని బట్టి పాఠకులు నిర్ణయిస్తారు. కాలపరీక్షకు తట్టుకొని ఎక్కువమంది పాఠకుల ఆమోదం పొందినదే గొప్పరచన కావడానికి ఎక్కువ అవకాశం ఉంది.



సాహితీవనం

బహుజనామోద యోగ్యమైన కొత్త కవితావస్తువు నిర్మాణ శిల్పాలను, విశిష్ట అభివ్యక్తిరీతులను తోసిరాజనవచ్చు. వస్తునవ్యతకు తనదైన నిర్మాణ సౌష్ఠవం, కొత్త కవిత్వ భాష తోడైన కవితలు తెలుగు కవిత్వంలో సంచలనాలు సృష్టిస్తూ, కొత్త ధోరణులకు మార్గదర్శనం చేయవచ్చు.

కవిత్వానికి లౌకికత అవసరం. సమకాలీన చరిత్ర అవగాహన కవిని సమర్ధవంతంగా తీర్చిదిద్దుతుంది. కవికి సామాజిక జీవితం బలంగా ఉంటే కవిత్వం మరింత శక్తివంతంగా అభివ్యక్తమవుతుంది. అభివ్యక్తి గాఢతలేని భావజాలం ఇవాళ కవిత్వం కాజాలదు. వస్తురూపాల ఐక్యతేకాదు, దాని స్వభావం కూడా విశుద్ధంకావాలి. మంచి కవిత్వానికి వస్తువైవిధ్యం వస్తువుని కొత్తగా ఆవిష్కరించడం శోభనిస్తుంది. చక్కని అభివ్యక్తి తనదంటూ ఓ శైలి ప్రతి కవికీ అవసరం.

నిజమైన కవిత్వం చదివిన పాఠకుడు నిమగ్నతలోకి జారిపోతాడు. అపూర్వమైన భావధార నేరుగా గుండెలోతుల్లోకి నిశ్శబ్దంగా జాలువారుతుంది. భాషలో ఆడంబరం, శబ్దంపై మమకారం ఏమాత్రం కనిపించదు.

ప్రగతి కాముక నిబద్ధకవులు అనేక ఇబ్బందులను ఎదుర్కొంటూనే ముందుకుపోయే ప్రయత్నం చేస్తున్నారు. సామాజిక ఆర్థిక ఒత్తిడులు ఈరకమైన వాతావరణాన్ని సృష్టిస్తూ దాడిచేస్తున్నప్పుడు కవి ఇంకా ఎంతో అప్రమత్తంగా ఉండాలి. అంతేకాదు, కవిత్వాదరణకు, కవిత్వానికి అవసరమైన సామూహిక భావావేశాలు కలిగిన సామాజిక ఉద్యమాల నిర్మాణంలోనూ పాలుపంచుకోవాలి.

కవిత్వం గొప్ప అనుభూతిని కలుగచెయ్యాలి. తాము అనుకుంటున్న విషయాన్ని కవి శక్తివంతంగా చెప్పినప్పుడు, పాఠకులు ఆ అనుభూతికి లోనవుతారు. ఉత్తేజితులవుతారు. ఇది లేనప్పుడు కవిత్వం చదవడానికి ఎవరూ ఇష్టపడరు. మంచి కవిత్వం మనిషి హృదయంలాంటిది. అందుకే అది జీవన సత్యాలని చెబుతుంది.

కొంతమంది కవులు ఉత్తుంగ తరంగాల్లా సాహిత్యసాగరంలో ఎగసిపడతారు. వారిలో కొందరు కవితా తీరాన్ని చేరుతారు. మరి కొందరు తీరాన్ని చేరే ప్రయత్నంలో నిరంతరం ఎగసిపడుతూనే ఉంటారు.

ఇంకొందరు ఉంటారు- పూలదండలో దారంలా పనిచేసుకు పోతుంటారు. ఇలాంటివారు ఉన్నారని ఎవరూ గుర్తించలేనంత నిశ్శబ్దంగా వీరి కృషి సాగుతూ ఉంటుంది.

**-ఎస్.ఆర్.భల్లం, తాడేపల్లిగూడెం.**

# పాలిడాల్

**తమిళ మూలం: డా॥ నటేశన్**
**అనువాదం: జిల్లేళ్ల బాలాజీ**

**మగాడు యవ్వనంలో ఉన్నప్పుడు తన కామ ప్రకోపంచేత, తనకు నచ్చిన స్త్రీని వశపరచుకోవచ్చని భావిస్తాడు. మధ్య వయస్సులో ధనబలంచేత అది సులభమవుతుందని మనసంటుంది. వృద్ధాప్యంలో పిల్లలూ, కుటుంబం పేరుతో స్త్రీలను కట్టుబాట్లతో ఉంచవచ్చని అతడు నిర్ణయిస్తాడు.**

...ఇలా మగాళ్ల ఆలోచనలు పరుగులు తీస్తాయి. అన్నా కెరోనివాలు రష్యాలో మాత్రమే కాదు, శ్రీలంకలోని ప్రతి గ్రామంలోనూ ఉన్నారని అర్థం చేసుకునే సందర్భం నాకు ఎనభయ్యవ ఏట సంభవించింది. ఆ అనుభవం ఎంతో ప్రత్యేకమైంది.

చనిపోయిన మనుషుల శవాలను కోసి అంతర్భాగంలోని అవయవాలను పరిశీలించి చూసే అనుభవం వైద్యులకు మాత్రమే లభిస్తుంది. తక్కినవాళ్లకు ఆ సందర్భం లభించినప్పటికీ అది మనసుకు ఉపయోగపడేదిగా ఉండదు. చాలా మందికి కళ్లు తెరిచి చూడటానికి కూడా వీలుకానిది.

దక్షిణ లంకలోని ఒక చిన్న నగరంలో ప్రభుత్వ వైద్యుడుగా పనిచేసే మిత్రుడు కుమార్ ఇంట్లో నేను కొంత కాలం ఉన్నప్పుడు, అతను చనిపోయిన శవాన్ని కోస్తున్నప్పుడు పక్కనుంచి చూసే అవకాశం నాకు కలిగింది.

రైతులు నివసించే చిన్న నగరం అది. నగరం చుట్టూ పదిహేను కిలోమీటర్ల వరకూ ఉన్న గ్రామాలకు ఆ నగరమే గుండెకాయ లాంటిది. ఆసుపత్రి, డాక్టర్ల క్వార్టర్స్, రైల్వే స్టేషన్, వ్యాపార కేంద్రాలు ఉండటంచేత ఆ నగరానికి రైతులు తమ నిత్యావసరాల కొనుగోలు కోసం అక్కడికొచ్చేవాళ్లు. ఆ నగరంలో నేను పశు వైద్యుడిగా ఉన్న రోజుల్లో అక్కడ కుమార్, ప్రభుత్వ వైద్యశాలలో వైద్యుడిగా పనిచేసేవాడు. అంతకుముందే విశ్వవిద్యాలయంలో మేం స్నేహితులుగా ఉండటంచేత మా స్నేహం అక్కడా కొనసాగింది.

ఒక ఆదివారం... ఇద్దరికీ సెలవు దినమే!




బయట బాగా ఎండ కాస్తోంది. మనుషులు, జంతువులు అన్న తేడా లేకుండా భగభగ మండిస్తోంది. ఎక్కడికీ వెళ్లకుండా మధ్యాహ్నం ఓ చిన్న కునుకు తీసి, సాయం కాలం ఎండ తగ్గాక ఓ స్నేహితుడింటికి వెళదామని అనుకున్నాం.

ఆసుపత్రిలో అంబులెన్స్ డ్రైవర్‌గా పని చేస్తున్నాడు సైమన్. అతనికి నలభై ఏళ్లుం డొచ్చు. తలవెనుకవైపు మాత్రం వెంట్రుక లున్నాయి. అతను తెల్లని చొక్కాను మాత్రం ఎప్పుడూ వదిలిపెట్టడు. అతని కుటుంబం 'కాండీ'లో ఉండటంచేత అతని తీరిక సమయాన్ని మాతో గడుపుతుండే వాడు. ఎప్పుడూ నవ్వుతూ, జీతం తీసుకోని సింహాళ యువకుడిగా ఆయన మాతో ఉండటమే కాక మాకు ఎన్నో విషయాల్లో సాయం చేస్తుండేవాడు. మాకు అతను కుడి భుజం లాంటివాడని చెప్పొచ్చు.



ఆ రోజు నాటుకోడిని కోసి, చిన్న చిన్న ముక్కలుగా చేసిచ్చేసి పక్కనే ఉన్న ఆసుపత్రికి వెళ్లిపోయాడు. అతణ్ణి మేం వంట చేయటానికి అనుమతించలేదు. అందుకు పెద్ద కారణమే ఉంది. కోడిమాంసంలో మనిషి దేన్నీ వృథా చేయకూడదన్న పొదుపు మనస్తత్వం కలిగినవాడు.

కొన్నాళ్ల క్రితం ఒకరోజు 'కోడిమాంసం వండనా?' అని అతను అడిగినప్పుడు 'సరే' నన్నాం. మధ్యాహ్నం భోజనం చెయ్యటానికి కోడిమాంసాన్ని గరిటెలోకి తీసుకున్నప్పుడు కోడి తల ఎర్రటి శిఖతో దర్శనమిచ్చింది. కాస్త అడుగు భాగంలోకి గరిటెను మళ్లీ తిప్పి పైకెత్తినప్పుడు కోడికాళ్లు కనిపించాయి. ఆరోజు మేం భోజనం సరిగ్గా చెయ్యలేక పొయ్యాం. ఆ తర్వాత వండటానికి సైమన్‌కు నిషేధం విధించేశాం. కోడి తోలును తీసి మాంసాన్ని ముక్కలు ముక్కలుగా చేసివ్వటంతో అతని పని పూర్తయిపోతుంది.

మాంసం వండటంలో నేను అనుభవ శాలిని కావటంతో కోడిమాంసాన్ని మొదట కొబ్బరిపాలలో ముంచి, కొద్దిగా కూడా నీళ్లు లేకుండా వండితే, కుమార్ తన వొంతుగా పప్పును పొమాడు. అతను వెజ్ భోజనాన్ని మాత్రం తినే కుటుంబం నుండి వచ్చినవాడు. నాతో కలిసి ఉన్న రోజుల్లో నంజుకోవటానికి మాత్రం అప్పుడప్పుడూ మాంసాన్ని తీసుకునేవాడు.

ఇలా వారానికొకరోజు మాత్రమే మధ్యాహ్న భోజనం చెయ్యటానికి వీలవటంతో, భోజనం చేశాక మాట్లాడుతూ కూర్చున్నాం. కడుపునిండా తినటంతో ఉన్న చోటునుండి లేవలేని పరిస్థితి ఏర్పడింది.

ఎవరో ఇంటి తలుపును బలంగా తడుతుండటంతో లేచి వెళ్లగానే అక్కడ మాకు అంతకుముందే పరిచయమున్న పోలీస్ ఇన్‌స్పెక్టరూ, ఆయన వెనక ఇద్దరు పోలీసులూ నిలబడున్నారు. వాళ్లతోపాటు అంబులెన్స్ డ్రైవర్ సైమన్ కూడా నిలబడున్నాడు.

"అయ్యగారికి పని బడింది" అని సైమన్, కుమార్‌నుద్దేశించి అంటూ లోపలికొచ్చాడు.

గుమ్మందగ్గర ఇన్‌స్పెక్టర్ తన విశాలమైన, ఎత్తయిన శరీరాన్ని పూర్తిగా ద్వారాన్ని అడ్డగించేలా నిలబడి "డాక్టర్, ఓ మహిళ రాత్రి 'పుల్ ఎలియ' అన్న ప్రాంతంలో చనిపోయింది. ఆమె శవాన్ని పోస్ట్‌మార్టమ్ చెయ్యాలి" అన్నాడు.

పెద్ద పెద్ద నగరాలలో దీనికంటూ వేరే వైద్యులు ప్రత్యేకంగా ఉంటారు. అయితే చిన్న చిన్న పట్టణాలలో ప్రభుత్వ వైద్యుడే పోస్ట్‌మార్టమ్ చేస్తాడు. సమస్యాత్మకమైన శారీరక భాగాలు కొలంబోకు వెళతాయి.

కుమార్ నన్ను తన వెంట రమ్మని అడిగాడు. కాస్త జంకుగా ఉన్నప్పటికీ బట్టలు మార్చుకుని జీపులోకి ఎక్కి కూర్చున్నాను. మా వెంట వచ్చిన సైమన్ చేతిలో ఓ తోలుసంచి ఉంది.

దారి పొడవునా పంటపొలాలూ, పూరిగుడిసెలూ మధ్య మధ్యలో కొన్ని పెంకుటిళ్లూ కనిపించాయి. ఫాల్గుణ మాసం కావటంతో వరిపంట సమృద్ధిగా పండి, కోతకు తయారై తల వంచుకుని గాల్లో కదలాడుతున్నాయి. నెలాంతానికి అవి కోత కోయబడి కొత్త సంవత్సరానికి ముందే అమ్మకం జరిగిపోతుంది. ఆ ప్రాంత ప్రజలు కొత్త సంవత్సరంలో చేతినిండుగా డబ్బు సంపాదించేవాళ్లు. అయితే నెలలు గడిచేకొద్దీ వాళ్ల దగ్గర డబ్బులు ఖర్చయిపోయి, యేడాది చివరికి ఇంటికుండలనే కాదు, ఆడవాళ్లు తమ బట్టల్ని కూడా తనఖా పెడతారు. ఆ ప్రాంతంలో ఆడవాళ్ల బట్టల్ని తనఖా పెట్టుకుని డబ్బిచ్చే మనుషులు కూడా నాకు బాగా తెలుసు.

ఒక గంట జీపులో ప్రయాణించి ఆ గ్రామాన్ని చేరుకున్నాం.

బాగా వసతి కలిగిన ఒక పెంకుటిల్లు ముందు కొబ్బరిచెట్ల మధ్య జీపును ఆపారు. నేను చూసిన దృశ్యం నన్ను నిర్ఘాంతపోయేలా చేసింది. కొన్నాళ్ల క్రితం నేను ఆ ఇంట్లో ఒక రాత్రి గడిపి ఉన్నాను.

నాకు అంతకు మునుపే పరిచయమున్న 'పొడిసింఘ' అక్కడ నిలబడున్నాడు. ఆయన చేతికి బేడీలున్నాయి. ఆయన ఇద్దరు పిల్లలు ఏడుస్తూ పక్కనే నిలబడున్నారు.

ఇన్‌స్పెక్టర్ ఆ ఇంటి వెనక భాగానికి మమ్మల్ని తీసుకెళ్లాడు. అక్కడ పొడిసింఘ భార్య శవాన్ని మంచంపై పడుకోబెట్టి ఉన్నారు. ఆ శవం తల దగ్గర ఇద్దరు పోలీసులు నిలబడున్నారు. ఆ మంచం పక్కనే ఓ 'పాలిడాల్' బాటిల్ ఖాళీగా కనిపించింది.

ఇన్‌స్పెక్టర్, కుమార్‌కేసి చూస్తూ "ఇదే చోటులో రాత్రి నేలమీద చనిపోయి పడుంది. పక్కనే ఈ పాలిడాల్ బాటిలూ పడుంది. మామూలుగా ఒంటరిగా పడుకునే పొడిసింఘ తెల్లవారాకే శవాన్ని చూశారు" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్, కుమార్‌కేసి చూస్తూ "ఇదే చోటులో రాత్రి నేలమీద చనిపోయి పడుంది. పక్కనే ఈ పాలిడాల్ బాటిలూ పడుంది. మామూలుగా ఒంటరిగా పడుకునే పొడిసింఘ తెల్లవారాకే శవాన్ని చూశారు" అన్నాడు.

చనిపోయిన శీలావతి, పొడిసింఘకు ఏ రకంగానూ సరిజోడి కాదు. ఆ ప్రదేశంలో చూసేవాళ్ల కళ్లను ఆకర్షించే ఎర్రటి రంగూ, అందమైన కళ్లూ కలిగినది శీలావతి. పూలపూల స్వచ్ఛమైన నూలు చీరను నడుముకు చుట్టుకుని ఆమె నడవటం, నడయాడే ఒక తోటలాగా మగవాళ్లకు అనిపించేది. దీనికి మారుగా పొడిసింఘ సన్నగా రివటలా ఉంటాడు. గ్రామీణ చెమటతో నల్లగా మాడినట్టుండే రంగు, వీటన్నిటికన్నా మనిషి రాత్రయితే తాగుతూ కోనేట్లో చేపలా విహరించేవాడు.

"మాకు శీలావతి మరణంలో ఏ విధమైన అనుమానమూ లేదు. కానీ, ఆత్మహత్య అని నిరూపణ అయ్యేంతవరకూ పొడిసింఘను విడుదల చేయటానికి వీలుకాదు" అన్నాడు, ఇన్‌స్పెక్టర్.

"పోస్ట్‌మార్టమ్ చేస్తేనే నేను స్పష్టం చెయ్యగలను. ఈ ప్రదేశంలో అదెలా వీలవుతుంది? పిల్లలూ, భర్తా, బంధువులూ అందరూ ఇక్కడే ఉండగా?" అన్నాడు కుమార్ వెనకాడుతూ. పాలిడాల్ అన్న ఆ వ్యవసాయ క్రిమినాశిని వాసన చూసి ముఖం మాడ్చుకున్నాడతడు. తర్వాత శవం దగ్గరరకెళ్లి నోటిదగ్గర వాసన చూసి "వాసన పాలిడాల్‌ది లాగానే ఉంది" అన్నాడు.

ఆ గ్రామ ప్రజలంతా అక్కడ గుమిగూడారు. శవానికి దగ్గరగా రాకపోయినా ఇంటిముందు పొడిసింఘతో మాట్లాడుతూ నిలబడ్డారు.

ఏ.సి.శవాల గది లేని ఆసుపత్రి కావటంతో శవాన్ని తీసుకెళ్లినా ప్రయోజనం లేదు. శవాన్ని తీసుకెళ్లటం వృథా ప్రయాసే అవుతుంది. ఆ ప్రదేశంలోనే పరిశోధించాలి.

ప్రస్తుత పరిస్థితిని అర్థం చేసుకున్న సైమన్ పోలీసులతో "సార్! రెండు చీరల్ని తీసుకుని రమ్మని చెప్పండి" అని చెప్పి కాస్త దూరంలో ఉన్న నాలుగు వెదురు కర్రల్ని తీసుకొచ్చి శీలావతి శవం ఉన్న మంచం చుట్టూ నాటాడు.

పిల్లలనూ, పొడిసింఘనూ తక్కినవాళ్లతో కలిసి దూరంగా వెళ్లమని, ఇన్‌స్పెక్టర్‌కు చెప్పగానే ఆ విషయాన్ని ఆయన పోలీసులతో చెప్పాడు.

ఐదు నిమిషాల్లో రెండు తెల్ల చీరలు తీసుకొచ్చి శవంచుట్టూ కట్టారు. ఇప్పుడా ప్రదేశం కప్పులేని శవాల గదిలా తయారైంది. సైమన్, తాను తీసుకొచ్చిన సంచిని తీసుకుని లోపలికెళ్లాడు.

పోలీస్ ఇన్‌స్పెక్టర్, నలుగురు పోలీసులూ అక్కడ నుండి దూరం జరిగారు.

కుమార్ లోపలికి వెళ్లగానే నేనూ లోపలికి వెళ్లాను. మృగాలను కోసిన నాకు మనుషుల్ని వైద్యులు ఎలా కోస్తారో చూడాలన్న ఉత్సాహం కలిగింది. సైమన్ శీలావతి ధరించిన ఎర్రటి దుస్తుల్ని స్నానం చేయించటానికి పసిబిడ్డ చొక్కాకున్న బొత్తాముల్ని ఒక తండ్రి ఎలా తీస్తాడో అలా లాఘవంగా తీశాక, ఛాతీ ప్రాంతంలో గుడ్డల్ని తొలగించి గొంతువరకూ పైకి తోశాడు. ఛాతీ, కప్పిన ముఖమూ తప్ప శరీరమంతా నగ్నంగా ఉంది. బిడ్డల్ని కన్న చిహ్నంగా ఆకాశంలోని మెరుపు తీగల్లాగా వంపులు తిరిగిన గీతలు కొన్ని కడుపు మధ్యనుండి పక్కకు జారి కనుమరుగై పోయాయి. నేనిక చూడలేకపోయాను. తలను పక్కకు తిప్పుకున్నాను.

"దుస్తుల్ని తొలగించగానే ఈ విషయంలో మనుషులూ మృగాలే" అంటూ గొంతు కిందనుండి కడుపు మధ్యవరకూ నలుపు బాల్ పాయింట్ పెన్‌తో గీత గీశాడు కుమార్.

ఆ ప్రదేశంలో సైమన్, చేతి గ్లౌజులు తొడుక్కుని అనుభవమున్న సర్జన్‌లా కొయ్యగానే నల్లటి ద్రవం కొంత బయటికొచ్చింది.

"ఇంకాస్త పైన"

గుండెదాకా ఆ కోత కొనసాగింది.

మోచేతి వరకూ ఎర్రటి రబ్బర్ గ్లౌజులు తొడిగిన చేతిని కడుపు లోపలికి దోపి ప్రేవుల్ని మెల్లగా బయటికి తీసి దానికి ఒక చిన్న కోత పెట్టమని చెప్పగానే కత్తిమొన ద్వారా పదునుగా ఒక చిన్న రంధ్రం చేశాడు సైమన్.

పసుపు రంగులోని ద్రవంలా.. పిత్త నీరుగా, రాత్రి తిన్న భోజనం ముత్యాల్లా బయటికొచ్చింది. తిన్న వెంటనే చనిపోయి ఉండాలి.

కుమార్ ఆ ద్రవం దగ్గరకు ముఖాన్ని పెట్టి 'పాలిడాల్' వాసనను పసిగట్టి మళ్లీ చేతిని పొట్టలోపలికి దోపాడు. ఐదు సెకన్ల లోపల ఏదో పోగొట్టుకున్న వస్తువును వెతుకులాడేలా వెతికాడు.

'పరిశోధన ముగిసింది!'

చేతికి సూదిని తీసుకుని దాదాపు గుడ్డను కుట్టేలా వేగంగా శరీరాన్ని కుట్టేశాడు సైమన్.

ఓ చుక్క రక్తమో, ఒంట్లోని ద్రవమో కారకుండా మళ్లీ ఆమె శరీరాన్ని సరిచేసి బొత్తాముల్ని తీసిన లాఘవంతో మళ్లీ పద్ధతిగా పెట్టేశాడు.

దగ్గర దగ్గర పది నిమిషాలలో కుమార్, సైమన్ లిద్దరూ చేతులు శుభ్రం చేసుకున్నారు.

"పాలిడాలే అసలు కారణమని నేను నిర్ధారిస్తున్నాను" అని చెప్పిన కుమార్‌తో కలిసి జీపులోకి ఎక్కాం.

పొడిసింఘు చేతికి ఉన్న బేడీలు తొలగించటం నాకు కనిపించింది. పోలీసులూ, ఇన్‌స్పెక్టర్ అక్కడే నిలబడ్డారు.

ఇంటికి తిరిగొచ్చాక సైమన్ తన పరికరాలను తీసుకుని మందుల అంగడికేసి నడిచాడు.

ఒంటరివాడయ్యాక కుమార్ "ఆ పొడిసింఘు నాకు ముందే తెలుసు. ఒక డాక్టర్‌గా అతణ్ణి ఎన్నోమార్లు కలుసుకోవటంతోపాటు అతడికి గత వారం అతని ఇంట్లో నేనూ, నా సహాయకుడూ 'సమరసింఘు' బస చేశాం" అన్నాను.

"నేనేగా గత సంవత్సరం వాసెక్టమీ ఆపరేషన్ చేశాను. అయితే శీలావతి మూణ్ణెల్ల గర్భవతి" అన్నాడు, కుమార్.

"అందుకేనా రెండోసారి చేత్తో వెతికావ్?" అని అడిగాను.

"ఆత్మహత్యకు అదే కారణం. 'చావుకు కారణం పాలిడాలేగా?' అని పోలీసోళ్లు నన్ను అడిగారు. అందుకే దాన్నే రాసిచ్చాను" అన్నాడు, కుమార్.

"నా అనుమానం నా సహాయకుడిమీదే!" అన్నాను.

"ఎవరు? సమరసింఘునా?"

"కొన్నాళ్ల క్రితం సాయంత్రం మూడు గంటలుండొచ్చు. ఆ రోజుటి పనులన్నీ ముగిశాయి. ఏదో ఆలోచిస్తూ వార్తా పత్రికలన్నీ తిరగేస్తున్నాను.

ఒడ్డికైన చిరునవ్వుతో ముందటి తల వెంట్రుకల్ని చేత్తో వెనక్కు తోసుకుంటూ వచ్చాడు సమరసింఘు, నా సహాయకుడు! వ్యవసాయ శాఖలో ఉద్యోగస్తుడు. ఊరందరూ ఎరిగిన సింహళీయుడు అన్న కారణాలవల్ల ఉత్సాహవంతుడైన యువకుడుగా నాకు అగుపించాడు. బయటి పనులకు ఎక్కువగా సమరసింఘునే నేను వెంటబెట్టుకుని వెళ్లేవాణ్ణి. పెళ్లి కాకపోవటమేగాక శృంగారోపాసకుడుగా కూడా అతడు నాకు అగుపించాడు.

"బండారా గారింట్లో ఆయన ఎద్దుకు ఆరోగ్యం బాగోలేదట. మిమ్మల్ని పిలుచుకురావటానికి వీలవుతుందా? అని అడిగారు" అని సమరసింఘు అడగ్గానే నేను వెనుకంజ వేశాను.

"ఆ గ్రామానికి మోటార్ సైకిల్‌పై వెళ్లి, మళ్లీ ఇంటికి తిరిగి రావటానికి బాగా రాత్రి అయిపోతుంది".

"లేదు సార్! మా స్నేహితుడి ఇంట్లో రాత్రి బస చేయటానికి వీలవుతుంది. సౌకర్యవంతమైన ఇల్లు".

సాయంత్రం ఐదు గంటలకన్నా ముందే బండారా గారింటి ఎద్దుకు వైద్యం చేసి, సమరసింఘు స్నేహితుడైన పొడిసింఘు ఇంటికెళ్లాం. ఆ ఊళ్లో వాళ్లదే పెద్ద బంగళా. శీలావతీ, పొడిసింఘు గుమ్మం దగ్గరకొచ్చి మమ్మల్ని మర్యాదపూర్వకంగా ఆహ్వానించారు. మేం ఆ ఊరి చెరువులో స్నానం చెయ్యటానికి వెళుతున్నామని చెప్పగానే, ఉతికిన రెండు తువ్వాళ్లను తీసుకొచ్చి ఇచ్చింది. శీలావతి ఆ గ్రామం మహిళగా అగుపించలేదు. గ్రామంలో ఏదో కారణంగా అవతరించిన దేవతలా కనిపించింది.

మాతోపాటు పొడిసింఘు ఓ చిన్న తువ్వాలుతో వచ్చాడు. పొలం గట్లమీద నడిచి వెళుతున్నప్పుడు "వొడ్లను తినటానికి వచ్చే ఎలుకల్ని వెతుక్కుంటూ పాములు వచ్చే సమయం; పెద్ద పెద్ద నాగుపాముల్ని ఇక్కడ చూశాను. చూసుకుని నడవండి" అంటూ పొడిసింఘు హెచ్చరించాడు. పైరు బాగా పెరిగి ఉంది. కిందికి వాలిపోయిన వొడ్ల గింజలతో పంటలు కనువిందు చేస్తున్నాయి. పంటలను దాటుకుని చెరువు దగ్గరికి వెళ్లేసరికి ఎర్రని తామరపూవులూ, పచ్చని ఆకులతో ఆ చెరువు ఎంతో అందంగా కనిపించింది.

చెరువు గట్టుమీద నడిచి వెళుతున్నప్పుడు ఓ చోట స్నానం చెయ్యటానికి అనువుగా తామరపూలు లేని నీరు స్వచ్ఛంగా కనిపించింది. ఆ చోటుకు కాస్త దూరంలో

ఒడ్డికైన చిరునవ్వుతో ముందటి తల వెంట్రుకల్ని చేత్తో వెనక్కు తోసుకుంటూ వచ్చాడు సమరసింఘు, నా సహాయకుడు! వ్యవసాయ శాఖలో ఉద్యోగస్తుడు. ఊరందరూ ఎరిగిన సింహళీయుడు అన్న కారణాలవల్ల ఉత్సాహవంతుడైన యువకుడుగా నాకు అగుపించాడు. బయటి పనులకు ఎక్కువగా సమరసింఘునే నేను వెంటబెట్టుకుని వెళ్లేవాణ్ణి.

చేపలు పట్టడంకోసం వలను విసిరాడు, పొడిసింఘు.

స్నానం చేసి నీటిలో నుండి లేవగానే ఒంటికీ, మనసుకూ హాయిగా అనిపించింది. ఈ స్నానం కోసమే ఇంత దూరం రావటం సమంజసమే అనిపించింది.

"సమరసింఘూ! నీకు వీళ్లతో ఇదివరకే పరిచయముందా?" అని అడిగాను.

"శీలావతి నాతోపాటు మా ఊళ్లో ఒకే క్లాసులో చదువుకుంది. పొడిసింఘు ఈ ఊళ్లో పొలం, యంత్రాలు అన్నీ ఉన్న ఓ పెద్ద రైతు అవటంతో పెళ్లి చేసిచ్చారు. ఇద్దరు పిల్లలు పుట్టారు. అయితే పొడిసింఘు తాగుబోతు. అలా ఇలా కాదు, అన్ని పొలం యంత్రాలనూ అమ్మేసి తాగటానికి ఖర్చు పెట్టేశాడు.

"చూస్తుంటే మనిషి అమాయకుడిలా ఉన్నాడు. మనకోసం చేపలు పడుతున్నాడు"

"తాగుబోతుతనం తప్పిస్తే మిగతా విషయాలలో మంచివాడే"

కాసేపటికి పొడిసింఘు మాతో కలిశాక ఇంటికి బయలుదేరాం. పొడిసింఘు చేతిలో ఐదు చేపలు విలవిలలాడుతున్నాయి.

ఇంటికొచ్చాక పొడిసింఘు మంచి సరుకు తెల్లని సారాను గ్లాసుల్లోకి వొంపి మాకిచ్చాడు. జింక మాంసం ముక్కల్ని వేయించి తీసుకొచ్చింది శీలావతి.

నషాళానికెక్కింది ఆ తెల్ల సారా. నా వల్ల కొంచమే తాగటానికి వీలైంది. కానీ మొత్తం సారాను పొడిసింఘు, సమరసింఘులిద్దరూ పూర్తి చేశారు. కాసేపటికంతా పొడిసింఘు ఏమీ తినకుండానే నిద్ర పోవటానికి వెళ్లిపోయారు.

మేం ఆయన్ను భోజనానికి రమ్మని బలవంతం చేసినపుడు, అతడు నిద్రలోకి జారిపోయి కనిపించాడు. నులక మంచంమీద పడుకున్న ఆయన తలకింద ఓ తలగడను పెట్టింది శీలావతి.

మాకు చెరువు చేపల పులుసుతో కంచం నిండుగా అన్నం పెట్టుకొచ్చి ఇచ్చింది. సముద్రపు చేపలు తిని తిని అలవాటుపడ్డ నాకు ఆ చెరువు చేపల పులుసు ఎంతో రుచికరంగా అనిపించింది.

భోజనమయ్యాక శీలావతి తాంబూలం తట్టను మా ముందు ఉంచి, "సార్ ఎక్కడినుండి వచ్చారు?" అంది, ఇంగ్లీషులో.

అంతవరకూ ఏమీ మాట్లాడకుండా ఉన్న దేవత ఆంగ్లంలో మాట్లాడ్డం ఆశ్చర్యంగా అనిపించింది. పొడిసింఘ వద్ద నేను అప్పటివరకూ సింహళ భాషలోనే మాట్లాడుతూ వచ్చాను.

"నాగదీప్" అన్నాను.

"అయ్యో సార్, నేను జీవితంలో ఏదో ఒకరోజు వెళ్లాలనుకున్న ప్రదేశమే నాగదీప్" అంది శీలావతి.

"అలాగా! ఎందుకు?" అని అడిగాను.

"తెలీదు... ఆ ఊళ్లోనే బుద్ధ సన్యాసులు ఇండియా నుండి లంకకు వస్తారని పుస్తకాల్లో చదివాను"

"ఎలాంటి పుస్తకాలు చదువుతావ్?"

"మార్టిన్ విక్రమసింఘ రాసిన సింహళ నవలలు. దానితోపాటు సింహళ భాషలోకి తర్జుమా చేయబడ్డ ఐరోపియా నవలలన్నీ చదివాను.

"ఎలా దొరుకుతాయి?"

"అదే నెలకోసారి అనూరాధపురం వెళ్లినపుడు..." అని అడ్డు తగిలాడు, సమరసింఘ.

"అలాగా, మంచిది!"

మహా విద్యాలయంలో పదో తరగతి చదివిన విషయాన్ని ఆమె చెప్పగానే అనూరాధపురంలో న్యూ ఇయర్స్‌డే రోజున ఆమె అందాలరాశిగా ఎన్నుకోబడిందని సమరసింఘ తెలిపాడు.

"నేను ఈమెకోసం ఎదురుచూశాను. అయితే శీలావతి పొడిసింఘను పెళ్లి చేసుకుంది" అని అతను నవ్వుతూ చెప్పినప్పుడు అతనివైపు సూటిగా చూశాను.

అతని ముఖంలో అర్థంకాని తపన ఏదో కనిపించింది.

"నాన్న లేడు. అమ్మే నిర్ణయం తీసుకుంది. అందుకని ఇలా అయిపోయింది" అంటూ పొడిసింఘ పడుకుని ఉన్న గదివైపు చూస్తూ అంది శీలావతి.

ఆమె కూడా తాంబూలం వేసుకుంది. ఆ ఎర్రటి పెదాలు ఆ ఊరి చెరువులోని తామరపువ్వులా విచ్చుకున్నాయి. మా మాటల మధ్యలో ఆమె పిల్లలొచ్చి ఆమెను అతుక్కుపోయారు.

నేను పొడిసింఘ పక్కనున్న మంచంమీద పడుకున్నాను. నా పక్కనే సమరసింఘ పడుకోగానే పొడిసింఘ గురక పులి గర్జనలా వినిపించింది. తాగిన సారా ఎక్కువ కావటంతో గురకను వినగానే సంతోషం కలిగింది. అయితే మధ్యలో ఆపినపుడు పొడిసింఘ ప్రాణంతో ఉండాలని భావించాను. ఆ గురక జోలపాటతో నిద్ర ముంచుకొచ్చింది.

అర్ధరాత్రి ఏదో కలగని, నేను మేల్కొగానే వంట గదిలో ఏదో శబ్దం వినిపించింది. నా పక్కనే పడుకున్న సమరసింఘ కనిపించలేదు. పొడిసింఘ గురకశబ్దం వినిపిస్తూనే ఉంది.

* * *

"పాపం పొడిసింఘ! తన ఇద్దరు పిల్లల్నీ అతనే పెంచాలి. అందుకన్నా ముందు అతను తాగుడును వదిలిపెట్టాలి" అన్నాడు, కుమార్.

శీలావతి నగరవాసిగా ఉన్నట్టయితే విడాకులకు దరఖాస్తు చేసుకుని ఉండేది. గ్రామం కావటంతో పాలిడాల్‌ను వెతుక్కుంది.

రష్యాల్లో మొదటిసారిగా రైలు నడిచినపుడు లియో టాల్‌స్టాయ్ 'రాక్షస యంత్రాలు ప్రాణం పోసుకున్నాయి' అని వాటిని ఎదిరించారు.

ఆయన కథానాయకి అన్నాకెరినోవా అందులోనే ప్రాణం వదిలింది. నవీన వ్యవసాయంలో ముఖ్యమైన క్రిమినాశినిగా పాలిడాల్ లంకకు వచ్చింది. శీలావతి ప్రాణాన్ని బలిగొంది. ■




## సమయస్ఫూర్తి

**ఒక** మహిళ వరద బాధితుల సహాయార్థం చందా వసూలు చేయడానికి ఒక ఆఫీసుకి వెళ్లింది. అక్కడి మేనేజర్‌తో తను వచ్చిన విషయం చెప్పింది.

మేనేజర్ ఒక వంద రూపాయల నోటు, ఒక రూపాయిబిళ్ల టేబుల్ ఉంచి "ఈ రెండింటిలో ఒకదానిని న్యాయంగా చందాగా తీసుకోండి" అన్నాడు.

"నా తండ్రి నాకు నేర్పిందేమంటే పెద్ద, చిన్న వస్తువులలో దేని విలువ తక్కువో దాన్ని ఎంచుకోమన్నాడు. అందువల్ల నేను రూపాయి తీసుకుంటాను... పెద్దవాళ్లు ఇచ్చే చందా పక్కవాళ్లకు తెలియకూడదని అని మరీ మరీ చెప్పాడు. కనుక మిమ్మల్ని కించపరచటం ఇష్టంలేక ఈ వంద రూపాయి నోటులో రూపాయి బిళ్లను దాచి తీసుకెళ్తాను" అని వంద నోటులో రూపాయి బిళ్లను మడిచిపెట్టుకుని తీసుకెళ్లిపోయింది.

ఇక చేసేదేమీ లేక మేనేజర్ జుట్టు పీక్కున్నాడు.

## ఆకాశం

**ఒక** స్కూల్లో ఇన్స్పెక్షన్ జరుగుతోంది. ఇన్‌స్పెక్టర్‌గారు పిల్లల్ని ప్రశ్నలడుగుతున్నాడు.

"ఒరేయ్ డుంబూ! రోడ్డుమీద నడిచేటప్పుడు నీ తలపై ఏం కనిపిస్తుందిరా?"

డుంబూ: ఆకాశమండీ!

ఇన్‌స్పెక్టర్: వెరీగుడ్! మరి ఆకాశం వర్షిస్తున్నప్పుడు.

డుంబూ: గొడుగండీ!

## చెత్తా-చెదారం

**ఓ** ప్రియుడు తన ప్రియురాలితో "నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో నీకు తెలియదు ప్రియా! నువ్వు నన్ను పెళ్లి చేసుకోవటానికి సరేనంటే నేను నీ పాదాల వద్ద నా హృదయం, నా శరీరం, నా ప్రాణం, నా సర్వస్వం-ఉంచుతాను" అన్నాడు.

ప్రియురాలు మందహాసం చేసి "కానీ నా పాదాలవద్ద ఇంత చెత్తా-చెదారం పడుండడం నాకు ఏమాత్రం ఇష్టంలేదు" అంది.

## చిన్నవాణ్ణి...

**ఓ** వెర్రి వెంగళప్ప మరో వెంగళప్పతో "నేను రెండేళ్లవాడిగా ఉన్నప్పుడు తీవ్రమైన అనారోగ్యానికి గురయ్యానని నీకు తెలుసా?" అన్నాడు వెంగళప్ప.

"అలాగా! మరి బతికి బట్ట కట్టావా?" అన్నాడు, రెండో వెంగళప్ప.

"నీ తెలివి తెల్లారినట్టే ఉంది. రెండేళ్ల పసివాడిని నాకేం తెలుస్తుంది?" అన్నాడు మొదటి వెంగళప్ప.

## చిన్నవాణ్ణి...

**ఆ** కుటుంబ తాత, ముత్తాతలంతా మహా పిసినార్లుగా పేరు పొందారు. ఇప్పటి తరానికి చెందిన ఓ పెద్దాయన బాగా పాతబడ్డ తన ఇంటి మెట్లను మార్చి కొత్తవి కట్టించాలను కున్నాడు.

కొత్త మెట్లను కట్టిస్తే ఖర్చు ఎక్కువవుతుంది కనుక పాతవాటినే తిరగేసి కట్టమని మేస్త్రీకి చెప్పాడు.

కాసేపయిన తరువాత మేస్త్రీ వచ్చి "అయ్యా! అలా చేయడం కుదరదు. మీ తాతగారికి ఆ ఉపాయం ఇదివరకే వచ్చినట్లుంది" అన్నాడు. ■

# పల్లె

**పల్లె**
అమ్మలాంటిది
ఆకలి తీర్చి
అక్కున చేర్చుకొంటుంది.

పల్లె
నాన్న లాంటిది
నడక నేర్పి
బాధ్యత భవిష్యత్తునిస్తుంది.

పల్లె
అక్కలాంటిది.
అనురాగం కూర్చి
అవసరతలో ఆదుకొంటుంది.

పల్లె
అన్నలాంటిది.
ఆప్యాయత పేర్చి
ఆపదలో అండగా నిలుస్తుంది.

పల్లె
తాతయ్య లాంటిది.
అనుభవాలు రంగరించి
జీవితపాఠం బోధిస్తుంది.

పల్లె
అపరంజి బొమ్మలాంటిది
సృజనాత్మకతను మేల్కొలిపి
ప్రతిభావంతునిగా మలుస్తుంది.

పల్లె
గురువులాంటిది.
సర్వ విద్యలు తెల్పి
సహాయ సహకారాలు అందిస్తుంది.

పల్లె
పదవ తరగతిలాంటిది.
ప్రతి అంశంపై పట్టు కల్పించి
ప్రయోజకుణ్ణి చేస్తుంది.

పల్లె
దేవత లాంటిది
తప్పులు సైతం మన్నించి



గొప్ప మనస్సుతో దీవిస్తుంది.

పల్లెను మరిస్తే
తల్లిని కోల్పోయినట్లే...
పల్లెను ద్వేషిస్తే
తన మనుగడనే ప్రశ్నించినట్లే.

అందుకే ఓ మిత్రమా!
పల్లెను ప్రేమించు...
పల్లెను సేవించు...
పల్లెను ఆలోచించు...
పల్లె అభివృద్ధికై శ్రమించు...!

– పల్లోలి శేఖర్‌బాబు

# కార్పొ'రేట్' ఉద్దెరాశెలు

**తెలుగు** అచ్చులని సమాధి చేస్తూ
హల్లుల్ని ఆంగ్లం బురదతో కప్పేస్తూ
కార్పొ'రేట్' కలల్ని నిజం చేసే
కాన్వెంట్ ఉద్దెరాశెపూలు...
ఈ నర్సరీ, ఎల్‌కేజీ పిల్లలు.

పాలుబగ్గలు...
రంగు రంగుల యూనిఫామ్స్
టప్పర్‌వేర్ ప్లాస్టిక్ భోజనం
అందరి కలల్ని మోసే
ఛోటాభీమ్... డోరేమాన్ బొమ్మల
సాహసాల పుస్తకాల బ్యాగులు

ఉబికి వస్తున్న పాల కన్నీటితో
అమ్మ చంకను అదోలా
అన్యమస్తిష్కంలాగే దిగిపోతుంటారు
భుజ భారాన్ని మించిన కార్పొ'రేట్' సంచితో.

రైములన్నీ రిథమిక్‌గానే..
లేఖనమంటే రిక్తహస్తమే.
ఆంగ్లాన్ని అందలమెక్కించి
అమ్మ భాషను నిషేధిస్తూ

ఊపిరాడని ఇరుకు గోడలమధ్య
ప్రాణవాయువు లేకుండానే.
పరిసరాల విజ్ఞానం నేర్పుతారు
సంఘానికి దూరంగా హాస్టళ్లలో
నిషేధాజ్ఞల మధ్య
సమాజ శాస్త్రాన్ని శాస్త్రోక్తంగా బోధిస్తారు.

తల్లిదండ్రులూ శిక్షార్హులే...
కార్పొ'రేట్' పల్లవికి చరణాలై
బలవంతపుబరువుల్ని మోయిస్తున్నందుకు.

పాపం పిల్లలు మాత్రం
అయిష్టంగానే వెళ్తుంటారు.
అన్యమస్తకంగానే వస్తుంటారు.
తల్లిదండ్రుల లక్ష్యభారాన్ని
కార్పొ'రేట్' ఉద్దెరాశెలై మోస్తూ.

– అశోక్ అవారి

## రచనలకు ఆహ్వానం

రచయితలనుండి కథలు, కవితలు, సమకాలీన వ్యాసాలు స్వాగతిస్తున్నాం. రచనలతోపాటు మీ పేరు, చిరునామా, హామీపత్రం తప్పనిసరిగా జతచేయాలి. ఎంపిక కాని రచనలు తిప్పి పంపగోరేవారు తగిన పోస్టేజీ జత చేసిన కవరు పంపించాలి. ఇతర పత్రికల పరిశీలనలో ఉన్న రచనలు పంపించకండి. **రచనలు పంపించాల్సిన చిరునామా:**

**ఎడిటర్, ఆదివారం వార్త నం.396, లోయర్ ట్యాంక్‌బండ్**
**డిబిఆర్ మిల్స్ పక్కన, హైదరాబాద్-80**

## వాస్తువార్త

వాస్తువిద్వాన్ సాయిశ్రీ
డా॥ దంతూరి పండరినాథ్
3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3
సెల్స్: 9885446501/ 9885449458




# ఎప్పుడూ అనారోగ్య సమస్యలతో....

**ఎస్.ఆర్ - కరీంనగర్**

**ప్రశ్న:** ... నిరంతరం అనారోగ్య సమస్యలతో సతమతమవుతున్నాను. ఇల్లంతా వాస్తు ప్రకారం బాగానే వుందంటున్నారు. ఏమి చేయాలో పాలుబోవటం లేదు.

**జవాబు:** ఇల్లు వాస్తు ప్రకారం బాగానే వుంటే మీకు నిరంతరం అనారోగ్య సమస్య వుండేది కాదు. మీ ఇంటికి సంబంధించినంతవరకు అందరికీ అనారోగ్యం కలిగించే నైరుతి దోషాలు కనిపించటం లేదు. ఒక్కసారి మీ ఇంటి ప్రధాన ద్వారాన్ని పరిశీలించండి. ఆ ద్వార ప్రతిష్ఠ సరయిన విధంగా జరిగివుండదు. ద్వారం ఒక పక్కకు తిరిగిగాని, ఒరిగిగాని వుండే అవకాశం వుంది. దాన్ని సరయిన ముహూర్తంలో సరిచేయించండి. తప్పకుండా మంచి ఫలితాలుంటాయి. ఒకవేళ ద్వార ప్రతిష్ఠ సజావుగానే వున్నట్లయితే మీ ఇంటివాస్తు చూపించి జాగ్రత్త పడితే మంచిది. బాబా రక్ష!

## ఎందుకిలా జరుగుతోంది?

**ప్రదీప్‌కుమార్ - తూ.గో.జిల్లా**

**ప్రశ్న: నేను వేరే ఇంట్లో వున్నప్పుడు (అద్దె ఇంట్లో వున్నప్పుడు) డబ్బు పరిస్థితి, పనులు జరగడం, గొడవలు లేకపోవడం- అంతా బాగా వున్నది. ఏదో కారణంచేత ఈ ఇంట్లోకి వచ్చాను. వచ్చినప్పటినుండి అప్పులు, పనులు జరగకపోవడం, బడలిక, భార్యాభర్తల మధ్య గొడవలు, వీటికి ప్రత్యామ్నాయ పద్ధతులు తెలియజేస్తారని ఆశిస్తున్నాను. ఈ ఇంట్లో ఇలా ఎందుకు జరుగుతోంది?**

**జవాబు:** మంచి ఫలితాలనిచ్చే ఇల్లు మారేటప్పుడు ఒకటికి పదిసార్లు ఆలోచించాలి. ఒక ఇంట్లో ఫలితం బాగున్నప్పుడు, ఆ మంచి ఫలితాలనిచ్చే ప్రకంపనలు అనుకూలమయినవిగా వుంటాయి. ఆ ఇంటిని ఖాళీ చేసి మరొక ఇంటికి మారినప్పుడు, ఆ మారినటువంటి ఇంటి ప్రకంపనలు మనమీద ప్రభావాన్ని చూపిస్తాయి. పాత ఇంటి లాంటి అనుకూల ప్రకంపనలే మారిన ఈ ఇంట్లో కూడా వున్నట్లయితే మనకేమి ఇబ్బంది అనిపించదు. ఇప్పుడు వచ్చిన ఇంట్లో ప్రకంపనలు ప్రతికూలంగా వుంటేనే మీరు పేర్కొన్న విధంగా అసలు సమస్య మొదలవుతుంది. మీ ఒక్కరికే కాదు, ఇల్లు మారే ప్రతి ఒక్కరికీ ప్రతికూల ప్రకంపనల వలన నష్టాలపాలవడం, అప్పుల పాలవడం, భార్యాభర్తల మధ్య గొడవలు, అలసట, మనస్థానం మొ॥ వాటికి లోనవుతుంటారు. ఇదివరకు వున్న ఇంట్లో ప్రకంపనలు అనుకూలంగా వుండి సంతోషకరమయిన జీవితాన్ని చవిచూసినవారికి ఇల్లు మారిన తరువాత ప్రతికూల ప్రకంపనలు భరింపనలనివిగా వుంటాయి. ఇటువంటి పరిస్థితి రాకూడదనుకుంటే అందుకు అవసరమయిన, అనుసరణీయమైన చిన్న చిన్న చిట్కాల లాంటి పద్ధతులుంటాయి. వాటిని ఆచరణలో పెట్టడంద్వారా ఇల్లు మారటమనే ప్రక్రియ ఒక షాక్‌లాగా కాకుండా సౌమ్యంగా జరిగిపోతుంది. మీరు ప్రస్తుతం పేర్కొంటున్న పరిస్థితినుండి కొంత ఉపశమనం పొందటానికి ఒకసారి ఫోన్‌లో వ్యక్తిగతంగా సంప్రదించి సలహా పొందవలసిందిగా సూచిస్తున్నాను.

## పెళ్లి కుదరటం లేదు...

**సుదర్శనరావు - అరసవిల్లి**

**ప్రశ్న: నేను 1967లో ఇల్లు కట్టాను. ఆ కాలంలో మేం వాస్తు** అనుసరించలేదు. గాలి, వెలుతురు బాగా వచ్చే విధంగా మాకు అనుకూలంగా నిర్మించాం. గాలి, వెలుతురు బాగా వుండటమే 'వాస్తు' అనుకున్నాం. దాదాపు 35 సంవత్సరాలు మాకు బాగా జరిగింది. ప్రస్తుతానికి ఏ సమస్య లేదు. నా కుమారునికి 40 సం॥. వివాహం కావడం లేదు. ఈ సమస్యకు కారణం వాస్తు దోషమవుతుందా?



**జవాబు:** మీకు ప్రస్తుతానికి సమస్యలేవీ లేవంటున్నారు. మీకు ఏ సమస్య లేనప్పుడు దయచేసి మీ ఇంటి వాస్తు గురించి ఆలోచించవద్దు. అదే ఇంట్లో ఇదివరకు ఆరు వివాహాలు 25 సంవత్సరాల వయస్సులోనే జరిగాయని పేర్కొన్నారు. ఒక్క కుమారుని వివాహం ఆలస్యం అయినంతమాత్రాన వాస్తుమార్పులు చేయటం మొదలుపెట్టకండి. ఇంటివాస్తు బాగా లేకుంటే ఇంతవరకు జరిగిన ఆ వివాహాలు కూడా కాకపోయేవి. మీ ఇంటి ప్లానును మా ఈ-మెయిల్‌కి పంపించండి. అబ్బాయి జాతకం పరిశీలించి, దోషాలున్నట్లయితే తగిన శాంతులు సూచించటంవలన ప్రయోజనం ఉండవచ్చు. ■

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ----------------------------------------
పుట్టినతేదీ:-------------------- ఊరు: -------------
జన్మనక్షత్రం:----------తల్లిపేరు:---------------------
చిరునామా: ----------------------------------------
------------------ ఫోన్: -----------------------

# పర్సనల్ పాయింట్


చల్లా సుబ్రహ్మణ్యం
1 సి–ఐక్యూ టవర్స్, 3–4–540,
నారాయణగూడ, హైదరాబాద్–27
మొబైల్: 9866362224/ 9553662224
challascounsel@gmail.com
www.challascounsel.com




# ...దేనిమీదా ఆసక్తి ఉండటం లేదు!



**యం.రామేశ్వర్ – సంగారెడ్డి**

ప్రశ్న: నా భార్య వయసు **42**. రోజూ **60** కి.మీ. ప్రయాణం చేసి, ఉద్యోగం చేసి వస్తుంది. వచ్చాక నేను ఎంత సహాయం చేసినా తన పని తనకి బాగానే ఉంటుంది. ఉదయం వంట చేసి, పిల్లలిద్దరికీ, నాకూ బాక్సులు కట్టి **7** గం॥కి ఇంట్లోంచి బయల్దేరి వెళ్లి తిరిగి వచ్చేసరికి సా॥ **6.30** అవుతుంది.

ఈ మధ్య ఆమె చాలా డల్ అయిపోయింది. ట్రాన్స్‌ఫర్‌కోసం చాలా ప్రయత్నించాంగానీ అవలేదు. పిల్లల్ని విసుక్కుంటోంది. సెలవురోజు ఇంట్లో పెండింగ్ పడిపోయిన పనులు చేసుకుంటుందిగానీ ఎక్కడికీ రావటానికి ఇష్టపడటం లేదు. నాతో కూడా అంటీ ముట్టనట్లుగా వుంటోంది. శారీరకంగా, మానసికంగా బాగా దూరమైపోయింది. తన కొలీగ్స్ మరో ఇద్దరు ఇలాంటి ఉద్యోగమే చేస్తున్నారు. వాళ్లు బాగానే వున్నారు. ఈవిడే అన్నీ కోల్పోయినదానిలా ఉంటోంది. ఏదైనా గట్టిగా అడిగితే ఏడ్చేస్తుంది. ఏదైనా మానసిక సమస్య వుందంటారా? కౌన్సెలింగ్ ఇప్పిస్తే ఈమె మారుతుందా?

**జవాబు:** ఆమె కొలీగ్స్ ఉత్సాహంగా ఉండటం, ఈమె ఉండలేకపోవటం అనేది వారి వారి శారీరక, మానసిక ఆరోగ్యాన్నిబట్టి వుంటుంది. కొందరు త్వరగా అలసిపోతారు. కొంత మందికి ఎనర్జీ బాగా వుంటుంది. ఈమె శారీరకంగా, మానసికంగా బాగా అలసిపోవటం వల్లనే డల్ అయిపోయిందనిపిస్తోంది. కౌన్సెలింగ్‌కి రావటానికి ముందు ఆమెచేత లీవ్ పెట్టించి, పిల్లల్ని ఎవరికైనా అప్పగించి ఆమెని తీసుకుని ఎక్కడికైనా వెళ్లి ప్రశాంతంగా నాలుగు రోజులు గడిపిరండి. కొంత మార్పు తప్పకుండా వచ్చే అవకాశం ఉంది. తర్వాత అవసరమనుకుంటే కౌన్సెలింగ్‌కి తప్పకుండా రండి.

## సమస్యలోనే పరిష్కారం!?

**గూడూరు – నెల్లూరు జిల్లా**

ప్రశ్న: నా వివరాలు గోప్యంగా వుంచగలరు.

మాది జాయింట్ ఫ్యామిలీ. నా భర్త, బావగారు, మరిది, మూడు కుటుంబాలూ కలిసే వుంటాయి. అత్తయ్య, మామగారు వున్నారు.

మా పెద్ద తోటికోడలు చాలా మంచిది. చాలా సరదా మనిషి. అందరినీ నవ్విస్తూ, ఎప్పుడూ హాపీగా ఉంటుంది. మాకున్న ఆరుగురు పిల్లలకీ ఆమె పెద్ద ఎట్రాక్షన్. పిల్లల్ని చాలా ప్రేమగా చూస్తుంది. మేం సినిమాకి వెళ్తే పెద్దమ్మ పక్కన కూర్చోవటానికి పిల్లలు పోటీ పడతారు. సినిమా నుంచి వచ్చాక ఒక గంటసేపు ఆ సినిమా గురించి పిల్లలతో కలిసి మాట్లాడుతుంది. వాళ్లతో కలిసి ఆడటం, డ్యాన్స్‌లు... ఒకటేమిటి! ఆమె పిల్లల్లో ఒక పిల్లలా కలిసిపోతుంది.

నా సమస్యేమిటంటే– ఇంటికి ఎవరైనా బంధువులొచ్చినా, మేం ఎక్కడికైనా వెళ్లినా మనుషుల్ని అనుకరించి మిమిక్రీ చేసి పిల్లలకి చెప్పటం, వీళ్లు విపరీతంగా ఎంజాయ్ చేయటం జరుగుతూ వుంటుంది. ఇప్పుడు పిల్లలు కాస్త పెద్దయి అచ్చం ఆమెను ఇమిటేట్ చేస్తున్నారు. ఇది సరైన పరిణామంలాగా నాకు అనిపించటం లేదు.

మనుషులు వెళ్లిపోగానే వాళ్లని ఎగతాళి చేసినట్లుగా మాట్లాడ్డం నాకు నచ్చడం లేదు. రోజు రోజుకీ లిమిట్స్ దాటిపోతున్నట్లనిపిస్తోంది. అలాగని నా పిల్లల్ని కూడా నేను కంట్రోల్ చేయలేకపోతున్నాను. ఆమెతో నాకు పర్సనల్ గొడవలేమీ లేవు. తనంటే నాకు చాలా గౌరవం. ఇష్టం కూడా. తన ఎనర్జీ లెవెల్స్ చూస్తుంటే ఆశ్చర్యం వేస్తుంటుంది. ఈ సమస్యకి పరిష్కారమేమైనా వుందంటారా?

**జవాబు:** పరిష్కారం లేని సమస్యంటూ ఈ భూమ్మీద ఏదీ వుండదని నా నమ్మకం. పిల్లల్లో అందరికంటె ఎక్కువగా ఆమెని అనుకరించేవాళ్లని ఏదో వంకతో నా దగ్గరకి తీసుకురండి. ఆ తర్వాత ఏం చేయాలో నేను చూసుకుంటాను.

ఆమె మంచావిడ కనుక పిల్లలు ఎగతాళిగా ఎవర్నయినా మాట్లాడితే ఆమెకి చెప్పి, ఆమెద్వారా పిల్లలకి చెప్పించటం ఒక పద్ధతి.

ఆల్ ద బెస్ట్! ■

## పిల్లల్ని కొడితే!?

**జి.వి.కె.ఆర్ – హైదరాబాద్**

ప్రశ్న: మా పాప వయసు **16**. ఇంటర్ ఫస్టియర్. చదువుమీద మొదటినుంచీ శ్రద్ధ తక్కువ. సినిమాలు, టీవీ, ఫ్రెండ్స్‌తో గడపటం తన హాబీలు. కాలేజికి కూడ సరిగ్గా వెళ్లదు. ఫ్రెండ్ ఇంటికని చెప్పి వెళ్లి, ఫ్రెండ్స్‌తో కలిసి వేరే ఊరు వెళ్లి చాలా లేట్‌గా ఇంటికి వచ్చింది. ఇది జరిగి **6** నెలలయింది. ఆ రోజు వాళ్ల డాడీ చాలా సీరియస్ అయి బాగా కొట్టారు.

అప్పట్నుంచీ పాప ఆయనతో మాట్లాడ్డం మానేసింది. ఆయన కూడా ఆ రోజు నుంచీ పాపని బాగా అబ్జర్వ్ చేస్తూ తాను చేసే చిన్న తప్పుని సైతం పట్టుకుని నిలదీయటం, తిట్టటం చేస్తున్నారు. ఆయనేం మాట్లాడినా, అడిగినా సమాధానం చెప్పదు. తన కళ్లలో ఒక రకమైన కసి, ద్వేషం కనిపిస్తున్నాయి. కాస్త సున్నితంగా మందలించమని మా వారిని ఎంత బతిమాలినా తిడుతున్నారు. పాపని తీసుకుని ఒకసారి కౌన్సెలింగ్‌కి వద్దామనుకుంటున్నాను. తను తప్పు చేసినందుకే గదా ఆయన కోప్పడుతున్నారు. మరి పాప ఎందుకు గ్రహించటం లేదు?

**జవాబు:** మా నాన్న మంచి కోరే కొట్టారు... అని పాప తెలుసుకోవటానికి ఇంకా చాలా టైం పడుతుందమ్మా! టీనేజ్ పిల్లల్ని అస్సలు కొట్టకూడదు. తప్పు చేసినప్పుడు నిలదీసి తప్పు ఒప్పించి దోషిలా నిలబెడితె ఇలాగే జరుగుతుంది.

ఆమె ఆలస్యంగా రావటంవల్ల మీరెంత కంగారుపడ్డారో నిదానంగా చెప్పాలి. ఈ వయసులో రాత్రిపూట ఫ్రెండ్స్‌తో తిరిగితే జరిగే నష్టాల గురించి వివరించాలి. కొట్టి, తిట్టటంవల్ల ఇంకా చెడిపోయే ప్రమాదం వుంది. పాపనీ, మీ వారినీ తీసుకుని కౌన్సెలింగ్‌కి రండి. మా 'మనోప్రాణయోగ'లో మీ పిల్లల్ని మీరు ఎలా సొంతం చేసుకోవాలి? అనే టెక్నిక్స్ నేర్చుకోవచ్చు. ■

# పద మథనం-84

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | ■ | 4 | | 5 |
| | ■ | | ■ | | ■ | 6 | | ■ | |
| ■ | 7 | | ■ | ■ | 8 | | | | ■ |
| 9 | | ■ | 10 | ■ | | ■ | ■ | ■ | 11 |
| ■ | 12 | | | | | 13 | | ■ | |
| 14 | | ■ | ■ | ■ | 15 | | ■ | 16 | |
| ■ | 17 | 18 | | | ■ | ■ | 19 | ■ | |
| 20 | ■ | | ■ | ■ | 21 | | | ■ | |
| 22 | 23 | ■ | 24 | ■ | | ■ | | ■ | |
| 25 | | | | | | ■ | 26 | | ■ |

## ఆధారాలు

### అడ్డం

1. అస్ఖలిత బ్రహ్మచారి హనుమంతుని పుత్రుడు-6
4. మీ అందరికీ నమస్కారం-3
6. ఇంటికి కన్నం వేసేవాడు-2
7. అవును అన్నారు, చివరికి తెగ్గొట్టారు-2
8. కుంకు మపువ్వు-4
9. జబ్బు-2
12. పద్మాలవంటి కన్నులు కలవాడు-7
14. రాయలసీమ నుంచి రాయలు పట్టణాన్ని మిగిల్చి వెళ్లిపోయాడు-2
15. చుట్టూ నీటితో ఉన్న ప్రాంతం-2
16. కాస్త అటు ఇటుగా శాపం పెట్టాడు-2
17. అరటిపండు సంస్కృతంలోకి వచ్చేటప్పటికి ఇలా అయ్యింది-4
21. కార్యక్రమంలో కదం తొక్కిన సమూహం-3
22. చేపలు పడాలంటే ఇది అటూ ఇటూ వేయక తప్పదు-2
25. అన్ని రకాల కూరగాయలతో నిండిన తట్ట... నానాజాతి సమితి అని కూడా వ్యంగ్యంగా అంటారు-6
26. అతిగా వాగే చిన్నారి ముద్దుపేరు-2

### నిలువు

1. కండకావరం, పొగరు-2
2. వడక పెళ్లికొడుకు-3
3. భక్తైనా, రక్తైనా ముందు ఇది గడిస్తేనే-2
5. జలరాశిలో చిక్కిన చేప అటూ ఇటూ ఈదుతోంది-2
6. రెండూ అని ఒకేసారిగా వత్తి మరీ చెప్పండి-2
7. చావు పుట్టుకలు అనేవి లేకుండా నిలిచివుండటం-5
8. విశాఖ జిల్లాలో నారసింహ క్షేత్రం-4
10. ఆవకాయలో ముందు ఇది పెడితేనే ఆ పేరు సార్థకం-2
11. సూతమహాముని శౌనకాది మునులకు పురాణాలు చెప్పిన అడవి-6
13. కానుక ముందే తీసేసుకుంటే ఎలా-2
18. ముస్లిం సోదరుడే-2
19. తల తెగిన మొండెం అంటే కేతువు అని కూడా చెప్పవచ్చు-4
20. ఇంతులు చీటికీ మాటికీ ప్రదర్శించే చిరుకోపం-3
21. ఇంటికి ఉపయోగించుకునే దారు సామాగ్రి-3
23. చేపల్ని, పక్షుల్నే కాదు కుతంత్రంతో సాటివారిని ముంచాలన్నా ఇది వేయవలసినదే-2
24. మత్సరమనే ఈ పరదానే తీసివేయమని త్యాగరాజు వేంకటేశ్వరుని కీర్తించాడు-2

- నిర్వహణ: వాడ్రేవు ఉమాశంకర్

## పద మథనం - 82 సరైన సమాధానాలు రాసినవారు

1. తిరుమల వెంకటసూరయ్యనాయుడు, తిరుమల కనకవల్లి-మల్లాపూర్ 2. గోశికె నాగమణి వేంకటేశం-చిక్కడపల్లి 3. అడపా సత్యనారాయణ బాబ్జీ, సుమతి-నిజాంపేట రోడ్ 4. జి.మోహన్వెంకట్రత్నాజీ బాబు-హైదరాబాద్ 5. కోలా లింగమ్మ, కోలా శివాజిరెడ్డి-మాచర్ల 6. చల్లా లక్ష్మీనరసింహామూర్తి, చల్లా పవన్ కుమార్, చల్లా ప్రవీణ్‌కుమార్, చల్లా శ్రీసౌమ్య, ఉషశ్రీ, చల్లా సుబ్బారావు, చల్లా సరోజ-సనత్‌నగర్ 7. బత్తుల యాదగిరి-ఉప్పల్ 8. పులికంటి రాజేశ్వరరావు-అలకాపురి 9. ఆత్కూరి అన్నపూర్ణ-బాలయ్యశాస్త్రి లేఅవుట్ 10. ఎస్.టి.పి.కృష్ణమాచార్యులు-నాగోల్ 11. వెలగపూడి కృష్ణమూర్తి-అద్దంకి 12. జవంగుల కుమారస్వామి-పిడుగురాళ్ల 13. వై.వి.సిహెచ్.లీలాపద్మజ-బొబ్బిలి 14. గండ్లూరి బలరామశాస్త్రి-మల్లాపూర్ 15. యం.వి.రమణకుమారి-హైదరాబాద్ 16. ఇ.శ్యామసుందర్, యస్.యస్.ఎగ్గోని, సి.రాజలక్ష్మి-పుప్పాలగూడ 17. సుజాత కృష్ణమూర్తి బోనాల-హుజూర్‌నగర్ 18. ఎం.విష్ణువర్ధన్‌రెడ్డి, గోపాల్‌రెడ్డి, సూర్యమ్మ-మ్యాడంపల్లి 19.పసుపులేటి జేసురత్నం-నరసరావుపేట 20. పి.సత్యలక్ష్మి, ప్రేమ్‌కుమార్-భువనగిరి 21.ఎన్.ధనలక్ష్మి, ఎస్.పి.గంగిరెడ్డి-రాజమండ్రి 22. జి.నరేందర్ రాజ్-గోల్కొండ చౌరస్తా 23.ఎన్.సుభాష్‌చంద్రబోస్-విశాఖపట్నం

## పద మథనం - 83 సమాధానాలు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 శ | మం | 2 త | క | 3 మ | ణి | ■ | 4 సా | ర | 5 థి |
| ని | ■ | రు | ■ | డి | ■ | 6 కం | ద | ■ | :ప |
| ■ | 7 భ | వ | ■ | ■ | 8 సి | వా | రు | లు | ■ |
| 9 ము | క్తి | ■ | 10 సీ | ■ | నీ | ■ | ■ | ■ | 11 వి |
| ■ | 12 గీ | తా | మ | క | రం | 13 ద | ము | ■ | జ్ఞా |
| 14 ఏ | తా | ■ | ■ | ■ | 15 గం | డి | ■ | 16 క్రో | న |
| ■ | 17 లు | 18 రా | వ | అ | ■ | ■ | 19 ధ | ■ | యా |
| 20 తి | ■ | ధ | ■ | ■ | 21 అ | ద | ను | ■ | త్ర |
| 22 మం | 23 చం | ■ | 24 కుం | ■ | రు | ■ | ర్మా | ■ | లు |
| 25 చే | ప | ల | చె | రు | వు | ■ | 26 సం | త | ■ |

పేరు:

ఊరు:



# వారఫలం

వంగిపురపు వీరబ్రహ్మ దైవజ్ఞులు
నారాకోడూరు వేదాధ్యయన సంస్థానం
అంగలకుదురు, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్
ఫోన్: 08644-227516

## మేషం



వ్యాపారం కాస్త తగ్గుతుంది. అధికారులను సందర్శిస్తారు. విద్యార్థులకు అనుకూలమైన సమయం. కుటుంబ గౌరవం పెంపొందుతుంది. దూర ప్రాంతాలను సందర్శిస్తారు. మానసిక ప్రశాంతత చేకూరుతుంది. అనుకోని ధనలాభం. వారం మధ్యలో వ్యాపార, ఉద్యోగాల్లో బాగుంటుంది. స్వల్ప ఆరోగ్య సమస్యలు ఎదురవుతాయి. దూర దేశ ప్రయాణాలు చేస్తారు.

## వృషభం



వ్యాపారం మందకొడిగా సాగుతుంది. అధికారులను సందర్శిస్తారు. కుటుంబ గౌరవం పెంపొందుతుంది. దూర ప్రాంతాలను సందర్శిస్తారు. మానసిక సంతోషం లభిస్తుంది. స్వల్ప ఆరోగ్య సమస్యలు ఎదురవుతాయి. వారం మధ్యలో వ్యాపార, ఉద్యోగాల్లో బాగుంటుంది. దూర దేశ ప్రయాణాలు లాభిస్తాయి. వృధా కాలక్షేపం చేస్తారు.

## మిథునం



బంధు, మిత్రుల రాక ఆనందం కలిగిస్తుంది. ఆకస్మిక ధన లాభం పొందుతారు. వివాహాది శుభకార్య చర్చలు ఫలిస్తాయి. రుణాలు చేస్తారు. బాల్య స్నేహితులను కలుస్తారు. దీర్ఘకాలిక సమస్యలను పరిష్కరించుకుంటారు. మనోధైర్యం పెంపొందుతుంది. స్త్రీలవల్ల చిన్న చిన్న సమస్యలు ఎదుర్కోవాల్సి వస్తుంది. నేత్ర బాధలు బాధిస్తాయి.

## కర్కాటకం



ప్రభుత్వ సంబంధమైన సమస్యలు ఎదుర్కొంటారు. దుష్టులకు దూరంగా వుండటం మంచిదని తెలుసుకుంటారు. శ్రమ అధికమవుతుంది. శుభ కార్యాలకు అనుకూలమైన సమయం. రాజభయం. వృత్తి రంగాల్లో వున్నవారికి జాయింట్ సమస్యలు ఎదురవుతాయి. ధర్మరక్షణ కోసం పాటుపడతారు. ఆకస్మిక సంఘటనలు జరుగుతాయి. విద్యా, వివాహ ప్రాప్తి.

## సింహం



బంధు, మిత్రులతో మాట్లాడేటప్పుడు సంయమనం పాటించండి. కుటుంబ సమస్యలు తీరిపోతాయి. బంధుప్రీతి అధికమవుతుంది. మీ సామర్థ్యాన్ని గుర్తించే వాళ్లు ఎక్కువవుతారు. ఉద్యోగస్తులకు ప్రమోషన్ లభిస్తుంది. గృహ లాభం. సకాల భోజనం. స్త్రీలవల్ల స్వల్ప సమస్యలు ఎదురవుతాయి. ఆకస్మిక ద్రవ్యలాభం. మాతృసౌఖ్యం. అధికారులను సందర్శిస్తారు.

## కన్య



సామాన్య ధనలాభం పొందుతారు. వ్యాపార, వృత్తి రంగాల్లో ఉన్నవారికి బాగుంటుంది. ఉద్యోగులకు ప్రమోషన్ లభిస్తుంది. గుమాస్తాలతో మాట్లాడేటప్పుడు సంయమనం పాటించండి. యత్న కార్యసిద్ధి. ఉన్నత పదవీ యోగం ఉంది. ఉద్యోగులకు ధనలాభం. శుభకార్యాలు నిర్వహిస్తారు. విందు, వినోదాల్లో ఉత్సాహంగా పాల్గొంటారు. ఆధ్యాత్మిక చింతన పెరుగుతుంది.

## తుల



ఉద్యోగస్తులకు పదోన్నతి లభిస్తుంది. శత్రువులు సమస్యలు సృష్టించినా వాటిని అధిగమిస్తారు. దూర దేశ ప్రయాణాలు చేస్తారు. వృత్తి రంగాల్లో ఉన్నవారికి ధన లాభం. యత్న కార్యసిద్ధి. వ్యాపారస్తులు అధిక లాభాలు గడిస్తారు. వృత్తి రంగాల్లో ఉన్నవారు కీర్తి, ప్రతిష్ఠలు పొందుతారు. మానసిక ప్రశాంతత కరువవుతుంది. కోర్టు సమస్యలు పరిష్కారమవుతాయి. రుణబాధలు తగ్గుతాయి. అన్ని వ్యవహారాల్లో విజయం సాధిస్తారు.

## వృశ్చికం



అధికార ప్రాప్తి. సంతానంవల్ల సుఖ, సంతోషాలు లభిస్తాయి. సంఘంలో కీర్తి, ప్రతిష్ఠలు లభిస్తాయి. వృత్తి రంగాల్లో ఉన్నవారు ధన లాభం పొందుతారు. వాహనయోగం ఉంది. దంపతుల మధ్య అన్యోన్యత పెరుగుతుంది. నిరుద్యోగులకు ఉద్యోగం లభిస్తుంది. అన్ని వ్యవహారాల్లో విజయం సాధిస్తారు. ఉద్యోగులకు బాధ్యతలు పెరుగుతాయి. రుణబాధలు తగ్గుతాయి. ఇతర రంగాల్లో ఉన్నవారు సామాన్య ధనలాభం పొందుతారు. శ్రమ అధికమవుతుంది.

## ధనుస్సు



గృహ సౌఖ్యం. వాహన యోగం ఉంది. ఆరోగ్యం బాగుంటుంది. జాయింట్ వ్యవహారాల నుండి విడిపోతారు. రుణాలతో సంచారం చేస్తారు. ఉద్యోగ సౌఖ్యం. వృత్తి రంగాల్లో ఉన్నవారికి ధనలాభం. విద్యార్థులకు స్వల్ప ఆటంకాలు ఎదురవుతాయి. బంధువులతో కలిసి ఆనందంగా కాలం గడుపుతారు. శుభకార్యాలు నిర్వహిస్తారు. శారీరక శ్రమ అధికమవుతుంది. చేపట్టిన పనుల్లో ఆటంకాలెదురవుతాయి.

## మకరం



ధన ప్రాప్తి. వస్తువులను సమకూర్చుకుంటారు. సమస్యలు పరిష్కారమవుతాయి. మానసిక ఆందోళన చెందుతారు. బంధు, మిత్రులతో మాట్లాడేటప్పుడు సంయమనం పాటించడం మంచిది. వృత్తి రంగాల్లో ఉన్నవారు సామాన్య ధనలాభం పొందుతారు. మానసిక అశాంతికి గురవుతారు. వృథాఖర్చులు చేస్తారు. జాయింట్ సమస్యలు పరిశరిష్కరించుకుంటారు. అకారణంగా భయపడతారు. తొందరపాటు మంచిది కాదు.

## కుంభం



ఆందోళన పెరుగుతుంది. బంధు, మిత్రులతో జాగ్రత్తగా మెలగండి. కుటుంబ సమస్యలు తీరిపోతాయి. బంధుప్రీతి అధికమవుతుంది. మీ శక్తి, సామర్థ్యాలకు గుర్తింపు లభిస్తుంది. ఆర్థిక సమస్యలు తీరిపోతాయి. శుభకార్యాలు నిర్వహిస్తారు. నేత్రబాధలు ఎదుర్కోవాల్సి వస్తుంది. స్త్రీలవల్ల చిన్న చిన్న సమస్యలెదురవుతాయి. గృహ లాభం. సకాల భోజనం. సంతాన ప్రాప్తి. ఆకస్మిక ధనలాభం.

## మీనం



ఉద్యోగులకు చిన్న చిన్న సమస్యలు ఎదురవుతాయి. రుణబాధలు తీరిపోతాయి. స్వల్ప అనారోగ్యం. వ్యవహారాల్లో విజయం సాధిస్తారు. సామాన్య ధనలాభం పొందుతారు. దేశాంతర ప్రయాణాలు చేస్తారు. వ్యాపార పురోభివృద్ధి బాగుంటుంది. ఆర్థిక సమస్యలు తీరిపోతాయి. ధన వ్యయం. శారీరక శ్రమ పెరుగుతుంది. మానసిక సంతోషం లభిస్తుంది. శుభకార్యాల్లో పాల్గొంటారు. రుణాలు చేస్తారు.

